# కాళరాత్రి

ప్రఖ్య శ్రీరామమూర్తి

దేశికవితా మండలి,
విజయవాడ-2.

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
జూలై — 1955
వెల : రూపాయిన్నర.

దేశీ ప్రెస్
విజయవాడ-2.



సంపాదకులు :
కొండలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# 'కాళరాత్రి' : ఒకవైపునుంచి—



మన తెలుగు నాటకాల్లో 'చదివినా' 'ఆడినా' రసవంతంగా ఉండే నాటకాలు చాలా తక్కువ. ప్రయోగంలో ఎంతో ఆకర్షణీయంగా ఉన్న నాటకాలు ముఖ్యతః చదివిన సందర్భంలో ఎంతో పేలవంగా కనుపించడం అనుభవ పూర్వకంగా నే నెరుగుదును. అలా ఎందువల్ల ఉంటాయా అని నేను కొంత ఆలోచించాను. సాధారణంగా అలాంటి నాటకాలు వ్రాసే రచయితలు, వారు ఆ నాటకం వ్రాసే సమయం లో, కేవలంగా ఆ నాటక కల్పనావరణంలోనే నివసించక, ప్రేక్షకుల అభిప్రాయాలు లేక ప్రేక్షకుల అభిప్రాయాలకు తనే ఏకైక ఏజంటునని చెప్పే నాటక సమాజ దర్శకుని అభిప్రాయాలు సంతృప్తిపరిచే సన్నాహంలో అసలు వారు వ్రాయదలచుకున్న నాటక స్వరూపాన్ని విస్మరిస్తారు. (పాపం!) ఇలాంటి నాటక రచయితలలో ఒకణ్ణిగా ప్రస్తుతం నేనూ 'పరివర్తన' పొందుతూ ఉన్నాను. అంటే నాకు రుచించిన నా నాటకాలు ప్రేక్షక మహాశయులకు రుచించక పోవడం, నాకు ఎంతో వెగటుగా కనిపించినవి, వారికి ఎంతో తీపిగా ఉండడం కళ్ళారా కాంచగలిగిన 'భాగ్యం' నాకు పట్టింది. ప్రేక్షకుల సైకాలజీ పసిపిల్లల సైకాలజీ ఒకటే. 'బూరా' కావాలంటే 'బూరా' కొనిపెట్టాలి. కాదు కొనిపెడదామన్నా 'వద్దు బూరానే కావా'లని మారాం చేస్తుంది శిశువు. అలానే ప్రేక్షకులూను. ఆ టిక్కెట్టు కొనుక్కుని ఆ హాల్లో (మంత్ర మందిరం) అడుగు పెట్టేసరికి ప్రేక్షకుడు 'ప్రేక్షకులు'గా మారిపోతారు. 'తన' ఆలోచన 'తమ' ఆలోచనగా మారిపోతుంది. అందువల్ల ఒక నాటకం యొక్క విలువను నిర్ణయించే సందర్భంలో ప్రేక్షకుల అభిప్రాయం స్వీకార యోగ్యం కాదు.

ఒక నాటకానికి ఎన్నో దశలుంటాయి. రచయిత దాన్ని ఊహించడం ఆ ఊహకు ఒక రూప కల్పన చెయ్యడం, తరువాత దాన్ని ఉచిత విధానంలో రచన చెయ్యడం—ఇది ఒక దశ అనుకోవచ్చు. మరోదశ నాటక గ్రంథాన్ని

మోసుకుని ఒక సమాజాన్ని చేరడం, దాని తాలూకు ప్రధాన సభ్యులు, లేక డైరెక్టరు, వారితో చర్చించి, సంప్రదించి, (లాంఛనప్రాయంగా) చిట్ట చివరకు వారు వారి 'స్టేజీ అనుభవం'తో ఇచ్చిన అమూల్యమైన సలహాలకు అనుగుణంగా దాన్ని కొంత మార్పు చెయ్యడం—ఇది రెండవదశ. మూడో దశ వారు ఒకనాటి రాత్రి ఆ నాటకాన్ని ఒక హాల్లో ప్రదర్శించడం—ప్రేక్షకులు, ప్రదర్శకుల పరస్పర Action and Reaction లో ఉత్పన్నమయ్యే నాటక 'భ్రాంతి'-అది మూడోదశ.

ఇంతటితో నాటకం ముగిసినట్టు కాదు. నాటకం తరువాత నాటకం అంటూ ఒకటి ఉంటుంది. రెండవ ప్రదర్శనంలో చెయ్యవలసిన మార్పులు చూపరులు అప్పుడే అలిసిపోయిన నటులకూ రచయితలకూ అందిస్తారు. అవి శిరసావహిస్తామని రచయిత వాగ్దానం చేసిగాని ఇంటికెళ్ళి నిద్రపోకూడదు. ఇది ఆఖరు దశ.

ఈ ఆలోచన పురస్కరించుకునే నేను ఒక నాటకం చదివికాని ఒక అభిప్రాయం ఏర్పరచుకోను. ఇలా చదివినప్పుడు 'కాళరాత్రి' ఉత్తమ ప్రదర్శనీయమైన నాటకమే గాక ఉత్తమ పఠనీయ నాటకమని కూడా అనిపించింది. అంటే మన ఆంధ్ర నాటక 'రంగాన్ని అలంకరించిన కొద్ది సాహిత్య విలువలుగల నాటకాలలో 'కాళరాత్రి' ఒకటి అని. ఒక నాటకం చదువుతున్నామంటే ఆ నాటకం చూస్తున్నామని కూడా అర్థం. అంటే ఒక హాల్లో ఒక తారీఖురాత్రి కాకపోవచ్చు. చదవడం చూడడం రెండు ప్రత్యేక విషయాలుకాదు. ఉత్తమ నాటకం ప్రదర్శన యోగ్యతేకాక సాహిత్య యోగ్యత కూడా సాధిస్తుంది.

అసలు నాటక రచన — నాటక రచనకానీ మరే రచనకానీ ఎలా ఉత్పన్నమవుతుందీ ? మనిషి సృష్టి సలపకుండా ఎందుకుండలేడు అన్నది ఒక విచిత్ర విషయం.

మనిషికి పుడుతూనే ఒక 'అన్యాయం' జరిగింది. ఎంచాత జరిగింది ? అనే ప్రశ్నకు సమాధానం బహుశా ఇంతవరకూ దొరకలేదనుకుంటా.

మనిషి 'పూర్తిగా' పుట్టడు. 'అనుకున్నట్టు'గా పుట్టడు. 'అనుకున్నట్టు'గా బ్రతకడు. అంచాత మనిషి బ్రతుకుతూనే 'బ్రతుకు' కోసం వెదుకుతాడు. పరిపూర్ణ జీవన ప్రారంభ క్షణం కోసం అన్వేషిస్తాడు. ఈ అన్వే

ఈ నాటకంలో మొట్టమొదట గమనించదగిన విషయం నాటకం జరిగే వాతావరణం. సాధారణంగా మనిషి వాతావరణ జీవుడు (Creature of circumstance) రాజారావు అతిథులుగా వచ్చిన వ్యక్తులందరూ ఒక విచిత్రమైన వాతావరణంలో బంధింపబడ్డారు. ఒక నది ముఖద్వారంలో ఒక లంకలో ఒక పురాతన భవనంలో. పైగా తుఫాను వచ్చే సూచనలు. వెళ్ళడానికి లాంచీ ఉండదు. ఈ విచిత్ర వాతావరణంలో వీళ్ళ ప్రవర్తనలన్నీ ఒక్కమాటుగా బైటపడిపోతాయి ఉండబట్టలేక పోతారు. 'బిహేవియరిజం' పరిశీలిస్తే వీళ్ల ప్రవర్తనలను Follow కాగలుగుతాం. ఈ వాతావరణంలో రాజారావు చమత్కృతి, నారాయణ కమలల ప్రణయం, నరహరి అసూయా ద్వేషాలు, రామానుజంగారి స్వంత డబ్బా అన్నీ ఒక్కమాటు ఉబుకుతాయి. ఢీకొంటాయి. నాటకం జరుగుతుంది. నాటకం సాగుతున్నంత కాలం 'హాస్యము గుండే' కాని Appearance కు Reality కి సంఘర్షణ సాగుతుంది. రామానుజం తన 'విజ్ఞాన సంపద'ంతా Appearance ను సమర్థించడానికై వెచ్చిస్తాడు. కాని లాభం లేకపోతుంది. ఒక విధంగా చూస్తే ఈ నాటకంలో చాలా ట్రాజిక్ కారెక్టరు రామానుజంగారిదే. ఇది ఒక విధంగా న్యూస్‌పేపరు మెంటాలిటీ లేక యెలక్షన్ మెంటాలిటీ అనొచ్చు. అచ్చమైన 'ప్రజామనిషి' 'Appearance'కి ప్రతినిధి. (మినిష్టరయ్యే Qualifications పూర్తిగా ఉన్నాయి) నాటకం చివరలో నరహరి కంటె కూడా అధోవదనంతో నిల్చోవలసి వస్తుంది పాపం! ఆయన దిగులు నారాయణ చనిపోయాడనీ కాదు, నరహరిని గురించీ కాదు, కమల విషయమూ కాదు. ఎన్నడూ ఆత్మవిశ్వాసం చలించని మనిషికి అకస్మాత్తుగా ఆత్మవిశ్వాసం నశిస్తుంది. తన 'విజ్ఞాన సంపత్తి'లోని బండారం పడి తనమీద గౌరవం తన శిష్యులకే నశించిందని భయం! పైగా తన లోలో ఎంత ఎత్తుగా ఉందో తనకే తెలుస్తుంది (ప్రజలకు హామీలిచ్చే రాజకీయ నాయకులందరూ రామానుజంగారిని ఒక్కమాటు స్మరించుకోవాలి.)

అసలు నాటకంలో కేంద్రపాత్ర నరహరి. ఈ వాతావరణంలో అతనిలోని స్వభావపు పునాదులు కూడా కదుల్తాయి. అతను కమలను ప్రేమించాడో అతనికి మాత్రమే తెలుసు. కమల అతన్ని ఎంతగా ద్వేషిస్తున్నదో కూడా అతని ఒక్కడికే తెలుసు. అతని గాఢమైన ప్రేమ [illegible]యగా, ద్వేషంగా మారి అతన్నొక హంతకుడుగా మారుస్తుంది. కాని అన్వే

'నివురు గప్పిన నిప్పు' తూచి కాచి ప్రవర్తిస్తాడు. నిగ్రహంగలవాడు కనుక దాన్ని కనిపెడతాడు. రాజారావు చేసిన Mock హత్య ఇచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని తన కసి తీర్చుకుంటాడు. హత్యను హత్యతోనే సమర్థించుకోవాలి. హంతకుడు హంతకుడుగా ఆనందించాలంటే బ్రతికున్న సాక్షిని కూడా (సాక్షి ఎప్పటికైనా ప్రమాదకరం) ఖాళీ చెయ్యాలి. ఈ Stop కూడా తీసుకున్నాడు. ఇంత Cold planning కు మూలకారణం అతనిలో వ్యక్తిగతమైన 'Human element' అది కమలమీద ప్రేమ! కమల అంటే కరిగిపోతున్నాడు. ఎంత దాచుకుందామని ప్రయత్నించినా ఆ element దాచుకోలేక పోయినాడు. ఈ సున్నితమైన చిత్తవృత్తే అతని కన్ఫెషన్ కు దారి తీస్తుంది. నరహరిది చాలా Abnormal character. అంటే వాళ్ళ జీవితంలో ఎన్నో దశలు విచిత్రంగా ఉంటాయి. నరహరి - ఈ నాటకంలోలాగా — హంతకుడూ కావచ్చు, లేదా కమలవల్ల తను మోసపోయాడని తెలియగానే విరక్తుడూ వేదాంతీ కావచ్చు. ఈ దశ ఆ పాత్రల స్వభావాలమీద ఆధారపడి ఉంటుంది. అంతేగాక అలాంటి స్వభావంగల వ్యక్తులు ఎవరి జాలీ సహించలేరు, తమను చూసి జాలిపడితే సహించలేరు, నిండుతనం, Composure వారిలోనే ఉంటుంది. ఆ Self Consolation కూడా ఎవరికీ తెలియకుండా ఎంతో చాటుగా చేసుకుంటారు.

ఈ నాటకంలో జరిగిన ప్రేమ కలాపం — దాని దుష్పరిణామం విషయంలో గమనించ దగిన మరో అంశం ఉంది.

సరళ నారాయణని ప్రేమిస్తుంది. అతన్ని పొందాలని ఎంతో ఆతురత పడుతుంది. కాని నారాయణ కమలని ప్రేమిస్తాడు. నరహరి కమలను ప్రేమిస్తాడు. ఆమె ప్రేమను పొందలేకపోతాడు. కాని కమల నారాయణని ప్రేమిస్తుంది. ప్రతి మనిషి ఒంటరిగా జన్మించి జీవించి చనిపోతాడు. కాని ప్రతి మనిషీ మనుష్యుల సమూహంలో కలిసి ఉండాలి. ఇది ఎన్నటికీ పరిష్కరించబడని విషాదకరమైన సత్యం. ఈ సాన్నిహిత్య ఫలితంగానే మానవబంధాలు మనం కోరినంతగా శాంతిని తృప్తిని కావని తోస్తుంది. అంటే మనకు కావలసింది మనకు దొరకదు. మనకు దొరికింది మనకు కావలసింది కాదు. అందువల్ల మానవ ప్రణయాలు ఎప్పుడూ సుఖాంతం కావు. ప్రతి నాటకం ప్రతి జీవితం విషాదాంతమే.

ఈ నాటకంలో మరో ముఖ్యపాత్ర కమల. కమల నరహరి భార్య. నారాయణను ప్రేమిస్తుంది. కాని కమల చాలా స్వచ్ఛమైన వ్యక్తిగానున్న ప్రమాదం ఆమెకు నీడలా కనుపిస్తుంది. ఆమె ప్రేమ వొక పథంక[illegible]గా ఆమెనే వెంటాడుతుంది. కాని ఎలాంటి విషమ పరిస్థితి సమయంలో కూడా ఆమె ఆత్మవంచన చేసుకోలేకపోతుంది. సరళ ఉత్తరం విషయం [illegible]దాచినందుకు ఎంతో ఆత్మవేదన పొందుతుంది. నారాయణ భార్య అతన్ని అంతగా ప్రేమించడం తనకు ఇష్టం లేకపోతుంది. పరిస్థితులు విషమించి రాజారావు మీద దోషం ఆరోపింపబడిన సంధ్యావస్థలో ఆమె వొక ప్రే[illegible]గాలి లాగా వొక నిజాన్ని వెల్లడించవలసిన ప్రవక్తగా—ఎలాంటి పరిణామాన్నైనా వోర్చి—అలా మార్పు చెందుతుంది. పైగా ఆ సమయానికి ఆమెకు మిగిలిందేమీ లేదు. తను ప్రేమించిన నారాయణ చచ్చిపోయాడు. దానికి కారణం నరహరి అని తనకు స్పష్టంగా తెలుసు. పైగా హత్య అన్యాయంగా రాజారావుమీద మోపబడింది. ఈ విషవ్యూహాన్ని తనే ఛేదించాలి. ఒకవేళ అలా ఛేదించడంలో తనే ఆహుతైపోవచ్చు కూడా. అలా అయింది కూడా. కాబట్టి అంతిమ ఘట్టంలో పోరాడుతున్న శక్తులు రెండే రెండు. వొకటి : కమల. రెండు : నరహరి. అందాక ఈ నాటకానికి కమలే నాయిక అవుతున్నది. Action climax ను ఈమే నిర్వహిస్తున్నది. చివరి రంగంలో కమల 'నవ్వుతున్నారా మీరు?' అన్న దగ్గిరనుంచి ఆమెకూ నరహరికీ జరిగిన సంభాషణలు గమనింప దగినవి. ఇది ఆమె బహిరంగంగా నరహరికి ఎదురు నిలిచిన ప్రదేశం. తను నారాయణనే ప్రేమిస్తున్నాననీ, నరహరి అంటే తనకు విపరీతమైన అసహ్యమనీ, సరళ ఉత్తరం తనే దాచాననీ రాజారావు నిర్దోషి అనీ చెప్పేస్తుంది, నిజం బైటపెట్టేస్తానని బెదిరిస్తుంది. మళ్ళీ ఆమె ప్రవేశం తర్వాత ఈ నిశ్చయాన్ని అమలుపరుస్తుంది. కమల పాత్ర విషయంలో ముఖ్యంగా గమనించవలసిన విషయం—ఆమె సత్యనిరత. అంటే తను ఎన్నడూ భర్తకు ద్రోహం చేసిన సందర్భంలో కూడా తన అంతరాత్మకు విభిన్నంగా నడుచుకో లేదు. అంటే Profound sinnor లక్షణాలున్నాయి. అందాకనే Profound sacrifice చేసింది.

నాటకం కడపట కమలే నరహరిని షూట్ చేసినట్టు మలుపు తీసుకొస్తే ఎలా ఉండేదా అని నేను అనుకున్నాను. దానివల్ల ఆమె పాత్రలో మరో నూతనమైన మెరుపు వస్తుందేమో అనుకున్నాను. అంటే ఆమె

Sacrifice కు Sentimental appeal గాక Intellectual appeal వచ్చేది. దీనికి మరి శ్రీరామమూర్తి ఏమంటాడో !

ఇలాంటి నాటకాలు మన ఆంధ్ర నాటకరంగానికి కొత్త. Complex, Characters, Situations ఉన్న నాటకాలు, బహుశా ఇది మొట్టమొదటిది కూడా కావచ్చు. ఈ నాటకాల్లోని తెలుగు నీడలు సరిగా చిత్రించడం కూడా కష్టం. ఈ నాటికీ భీమ దుర్యోధనులు Costume మార్పుతో ముష్టి యుద్ధాలు సాగిస్తున్న మన నాటకరంగంలో ఇలాంటి నాటకాలు ప్రవేశపెట్టిన రచయిత ఎంతో అభినందనీయుడు. పైగా శ్రీరామమూర్తి ఈ నాటకాన్ని విజయవంతం చెయ్యడంవల్ల ప్రేక్షకులమీద నాకు గౌరవం ఇనుమడిస్తూ ఏర్పడుతూంది కూడా. అందుకు నేను రచయితకు వ్యక్తిగత అభినందనలు అందచేస్తున్నాను.

సెలవు !

—బెల్లంకొండ రామదాసు.



# ఆ ము ఖ మ్



ఒకానొక నదీముఖద్వారంలో ఒక లంక. దాని పేరు భైరవలంక. రాజారావు ఎస్టేటులో ఇదొక భాగం. ఇక్కడ మిగిలిందల్లా అతని పూర్వులు కట్టించిన ఒక పురాతన భవనం. భవన ప్రాకారానికి లోపలే ఒక చిన్న యింట్లో ఎస్టేటు మానేజరు, ఆయన భార్య, కూతురు నళిని, సేవకుడు వెంకన్న ఉంటారు. రాజారావు ఎప్పుడైనా ఏడాదికోసారి వచ్చి కొద్ది రోజులు గడిపి వెళ్ళిపోతూంటాడు.

ఒకసారి మిత్రులతో కలిసి సరదాగా నాలుగు రోజులు గడపటానికి రాజారావు భైరవలంకకు వస్తాడు. వచ్చిన మరునటి రోజు రాత్రి 9 గంటలకు తుఫాను వచ్చే సూచనలు కనబడతాయి. గుడ్డివెన్నెల వచ్చినట్టే వచ్చి యిట్టే మూసుకుపోతూ ఉంటుంది. అడపా తడపా ఉరుములూ – మెరుపులూ – హోరు గాలీ – దూరాన సముద్ర ఘోష — భీతావహంగా వుంటాయి.

---

ప్రదర్శకులకు సూచన : ఈ పరిచయ వాక్యాన్ని తెర యెత్తేముందు చదివి వినిపిస్తే ప్రేక్షకులకు కొంత సహాయకారిగా వుండగలవు.

# పాత్రలు:

| | | |
|---|---|---|
| రాజారావు | 22 సం॥లు | జమీందారు |
| వెంకన్న | 45 ,, | సేవకుడు |
| రామానుజం | 40 ,, | డిటెక్టివ్ నవలా రచయిత |
| నరహరి | 40 ,, | రాజారావు మిత్రులు |
| నారాయణ | 30 ,, | ,, |
| మోహన్ | 25 ,, | ,, |
| సుకుమార్ | 30 ,, | ,, |
| కమల | 25 ,, | నరహరి భార్య |
| నళిని | 20 ,, | ఎస్టేటు మానేజరు కూతురు |



'హోపర్ట్ ఇర్వింగ్ యంగ్' రచించిన
నాటకం ఆధార మాత్రంగా ఈ
నాటకం వ్రాయబడింది.

ఈ నాటకం మొట్టమొదటిసారిగా రవిరాజ్ మెమోరియల్ క్లబ్ (విజయనగరం) వారిచే 19-4-54 వ తేదీన ప్రదర్శింపబడినప్పటి నటవర్గం :

రాజారావు .... శ్రీ జె. వి. సోమయాజులు
నరహరి .... శ్రీ యం. భోగారావు
రామానుజం .... శ్రీ జె. వి. రమణమూర్తి
నారాయణ .... శ్రీ వి. వి. అప్పారావు
మోహన్ .... శ్రీ వి. యస్ దీక్షిత్
సుకుమార్ .... శ్రీ జె. వి. శ్రీరామమూర్తి
వెంకన్న .... శ్రీ బి. విశ్వేశ్వరరావు
కమల .... శ్రీమతి రత్నకుమారి
నళిని .... శ్రీమతి రాజకుమారి

నిర్వహణ : శ్రీ అప్పారావ్ దొర.

శ్రీ నవ్యకళా మండలి (విజయవాడ) వారిచే 16-10-54 న విజయవాడలో ప్రదర్శింపబడినప్పుడు :

రాజారావు .... శ్రీ జె. వి. రమణమూర్తి
వెంకన్న .... శ్రీ యం, వి. చలపతిరావు
రామానుజం .... శ్రీ కె. వెంకటేశ్వరరావు
నరహరి .... శ్రీ డి. జగన్నాథం
నారాయణ .... శ్రీ పి. శ్రీరామమూర్తి
మోహన్ .... శ్రీ సి హెచ్. శ్రీరాములు
సుకుమార్ .... శ్రీ కె. ప్రసాద్
కమల .... శ్రీమతి యస్. జయశ్రీ
నళిని .... శ్రీమతి ఆర్. నిర్మల

డైరెక్షన్ : శ్రీ కె. బి. వెంకటేశ్వరరావు
ప్రొడ్యూసర్ : శ్రీ పి. శ్రీరామమూర్తి.

# మొదటి అంకం

[రాజారావు భవనంలో ముందుహాలు – హాలులో ఎడమపక్క గోడకి ఎడమ చివరకి కిటికీ, వరండాలోకి పోయే వాకిలీ ఉంటాయి. కుడి పక్క గోడకు భోజనాల గదిలోకి (Dining Room - D.R) ఒక వాకిలి ఉంటుంది. వెనక గోడకు ఎడమ చివరనుంచి ఉన్న మెట్లు సుమారు పదడుగుల ఎత్తున ఉన్న చిన్న బాల్కనీ మీదకు తీసుకు పోతాయి. బాల్కనీమీదనుంచి రాజారావు పడకగదిలోకి (Bed-Room - B.R) ద్వారం ఉంటుంది. ఆ వాకిలికి ఎడమపక్కగా నేలబారున పడమటింట్లోకి (Drawing Room - Dr.R.) మరో ద్వారం ఉంటుంది. B. R. వాకిలికి కుడిప్రక్కగా నలభైసంవత్సరముల వయస్సుగల భద్రపురుషుని త్రివర్ణ చిత్రం ఒకటి తగిలించి ఉంటుంది. హాలులో ఒక మేజా, మూడు కుర్చీలు, రెండు సోఫాలు (Single seaters) ఉంటాయి.

తెర లేచేసరికి హాలులో టేబులులైటు తెల్లటి గుడ్డివెలుగు మాత్రం వుంటుంది. ఉన్నట్టుండి ఒక్కసారి ఉరుము – పెద్ద మెరుపు వస్తుంది. గది అంతా ఒక్కసారి ప్రకాశించి మళ్లీ చీకటవుతుంది. సుహాస్, రామానుజం ఓ పక్క కుర్చీల్లోనూ, మనోహరి, నళిని మరో ప్రక్క కుర్చీల్లోనూ కూర్చుని వుంటారు – టేబుల్ మీద కూర్చున్న సుకుమార్ చెప్పేదేదో వింటూ.....]

నళిని : ఆఁ– ఏం జరిగింది తర్వాత ?

సుకు : ఏముందీ ! మళ్ళీ ఆ రాత్రికూడా ఇద్దరూ ఆ సందు లోనే కలుసుకున్నారు. తమకేం ఫరవా లేదనీ ఎవళ్ళ

కంటూ పడమనీ అనుకున్నారు. హుఁ- అనుకోకుండా ఆవిడ మొగుడుకంటనే పట్టారు, పడే పడటంలోటే ఇద్దరూ చెరో గుండుకి ఆహుత్రై పోయాను. అంతే!

[మెట్లమీద ద్వారం తెరుచుకుని రాజా రావు బాల్కనీ మీదకు వస్తాడు...]

మోహన్: అయితే ఆమెనీ ఆమె ప్రియుణ్ణీ కూడా కాల్చి చంపింది ఆ భర్తేనంటావ్?

నళిని: సరే-రామాయణమంతా విని___

[రాజారావు బాల్కనీ మీదSwitch వేస్తాడు. లైటు వెలుగుతుంది.]

నళిని: హాలో రాజా!

రాజా: Crime club ఇంకా Sessions లోనే ఉందే! (మెట్లు దిగివస్తూ) ఎందుకు తీసుకొచ్చి కుమవకూర్చొ బెడితే హత్యలూ హంతకులూ తప్ప మరేం లేదటోయ్ మాట్లాడుకోటానికి మీకు?

నళిని: అదేమిటి-అంత సరదాగా అంత అద్భుతంగా వుండే విషయం మరోటేముంది?

సుకు: హత్యాకాండ కళ్ళారాచూసే అవకాశమే వస్తే మా యెత్తు ధనం పోసినా వదులుకుంటామా!

రామా: చాలా అనుకూలంగా వున్నది వాతావరణం కూడా ఇప్పుడు! నిర్మానుష్యమైన లంక-అందులోనూ భైరవ లంక! నిశీథసమయం - కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి- మెరుపులూ, ఉరుములూ-రాబోతున్న తుఫాను-

ఓహో—ఏంకావాలి హంతకుడన్న వాడికి యింతకంటే అనుకూల పరిస్థితులు !

రాజా: కనుక ఇక్కడకూడా ఓ హత్య జరిగితే బాగుంటుం దంటారా యిప్పుడు ?

సుకు : దివ్యంగా వుంటుంది !

రాజా: ఓరి నీ సాహసాలు !

రామా: సరేగాని సుకుమార్జీ ! చెప్తున్నారే మీరు 'సంధ్యా హత్య' ని గురించి ! సమంజసంగానే వుందిగాని అందులో మీ వూహ చాలవరకూ…ఆ హత్య అనుకోకుండా అప్పటికప్పుడు జరిగిన సంఘటన అని కదూ అంటున్నారు మీరు !

నర : నా వుద్దేశంకూడా అంతేనండీ ! ఆ క్షణంవరకూ కూడా హత్యచేద్దామనే ఆలోచనే లేదు. కాని ఆ దృశ్యం కళ్ళారా చూడగానే కలిగిన తాత్కాలి కోద్రేకంలో షూట్ చేసేశాడు.

రామా: అబ్బే ! ఏమిటంటా రయితే కారణం ఆ శవాలు కాలవలో పారేసి వుండటానికి ? అది క్షణికోద్రేకంలో చేసిన హత్య అయితే వుండ దలా తన నేరాన్ని కప్పి పుచ్చాలనే ప్రయత్నం! ఎందుకూ అదంతా Pre planned! ముందే ఆలోచించుకుని, అవకాశం కోసం కనిపెట్టుకూర్చున్న వ్యవహారం అది !

నళిని : అవునవును. రామానుజంగారు చెప్పేదికూడా సబబుగానే ఉంది.

రామా: కాదూమరి! అందుకనే వేశాను మళ్ళీ పోలీసులు పప్పులో కాలు—యథా ప్రకారం - మామూలుకు భిన్నంలేకుండా—హంతకుడు వ్యూహించిన ప్రకారం!

సుకు : నిజంగా మీ మాటల్లో ఎంత లాజిక్ వుంటుందండీ! మీ పుస్తకాలన్నీ కూడా అంత Exciting గానూ వుంటయ్. ముందు చివర పేజీ చదివితేగాని మనస్సు వుండబట్టదంటే నమ్మండి!

మోహ: (Dryly) అవునవును. నాకూ అంతే.

రామా: ఏముందండీ అపరాధ పరిశోధనం అంటే—ఉపయోగించాలి తెలివితేటలు—తగినట్లుగా! అంతే!

నళిని : ఎంత తూచినట్లు మాట్లాడుతారో చూడు రాజా! అచ్చం పుస్తకాల్లో రాసినట్లే!

రాజా: (Dryly) అవును. సరిగ్గా అలానే!

[ దూరాన ఉరుముల శబ్దం ]

సుకు : అబ్బ—ఆ ఉరుములు చూడండి. ఒక్కోసారి ఇక్కడ బలే భయమేస్తుంది బాబూ నాకు! యిలాంటి రాత్రిళ్లు మరీనూ! మీరు రాస్తుంటారు—దయ్యాల దీవులనీ, భూతగృహాలనీ——

మోహ: ఎప్పుడూ ఎవళ్ళో ఒకళ్ళు హత్య చేయబడుతూనే ఉంటారు——!

సుకు : ఆఁ— అల్లా వుంటుం దీ భైరవలంక కూడా!

రాజా : అవునూ—ఇక్కడున్నప్పుడే ఓ నవలరాసి మా గృహం పావనం చెయ్యరాదూ రామానుజంగారూ?

రామా: (ఓ చిరునవ్వు విసిరి) చెయ్యొస్తే నెప్పుడూ వృథా కాలక్షేపం—ప్రారంభించా నప్పుడే ఒకటి !

నళిని : నిజం ?

సుకు : చెప్పండి సార్—ఏం రాస్తున్నారు ?

మోహ: 'పాతాళగృహం'లా వుంటుందా యిదికూడా ?

సుకు : ఇందులో యెవరంటే పాపం హత్యచేయబడేది !

నళిని : హంతకుడి పేరుముందుకు చెప్పకండిసార్.

రాజా: పోనీ అదికూడా చెప్పెయ్యండి. మీరు రాయడమూ అది అచ్చుకావడమూ అన్నీ అయి పూర్తిగా చదివే దాకా ఆదుర్దా ఆపుకోవటం కష్టం చూడండి !

మోహ: నీకు వేళాకోళంగా వుందేమోగాని దేశంలో వున్న డిటెక్టివ్ నవలాభిమానులంతా ఓ సంఘంగా ఏర్పడాలని వీళ్ళు కృషి చేస్తున్నారు తెలుసా !

సుకు : అవును. దాని లక్ష్యాలేమిటో తెలుసా ? దేశంలోని అపరాధ పరిశోధక నవలారచయిత లందరినీ ముఖ్యంగా పచ్చిరకం హత్యల్నీ భయంకర మానసిక ప్రవృత్తుల్నీ విస్ఫుటీకరించి హృదయ విదారకంగా వివరించి అప్రతిమానమైన కీర్తి నార్జించుకున్న రచయితల్ని ఒకరివెంట నొకరుగా సన్మానం చెయ్యటం—ఊరూరా వాడవాడలా ప్రత్యేక డిటెక్టివ్ గ్రంథాలయాలు స్థాపించడం——

రామా: ఓహో ! పెట్టుకున్నారే చాలా పరమ పవిత్రమైన కార్యభారమే జీవితంలో మీరు !

సుకు : (శిరస్సు వంచి) కావాలి దానికి మీ ఆశీర్వచనం.

రామా: తప్పకుండానూ.

నళిని : అదిసరే! ఇందాక పుస్తకమేదో మొదలెట్టా మన్నారు—అసలు మీరు కొత్తపుస్తకం రాయాలంటే ఎలా ప్రారంభిస్తారండీ?

మోహ: ఏముందీ—ఏ పబ్లిషర్ నెత్తినో చెయ్యిపెట్టడమే—కాస్త అడ్వాన్సు కోసం!

సుకు : ఇదుగో—

రామా: (మోహన్ వైపు కాస్త చురచుర చూసి మళ్ళీ తన శిష్యప్రాయులతో) మామూలుగానే మొట్టమొదట... ఆఁ సృష్టించుకుంటాను నాక్కావలసిన పాత్రల్ని—

రాజా: దానికి ఎవళ్ళయినా పనికొస్తా రనుకొంటాను. ఉదాహారణకి మనలోనే ఒక దేవాంతకుడైన హంతకుడున్నాడంటే నే నాశ్చర్యపడను!

సుకు : నా మటుకు నాకేవుంది ఓ కధలో హీరోనైతే బాగుండునని!

నళిని : సరే—పాత్రసృష్టి అయ్యాక ఏం చేస్తారండీ?

రామా: Well నిలబెడతాను ఎవళ్ళకితగ్గ వాతావరణంలో వాళ్ళని...అప్పుడల్లుకొస్తాను కథ వాళ్ళచుట్టూతా... కాని వుండాలి కథకు తగ్గ Back ground!

రాజా: ఈ లంక సరిపోతుందా?

సుకు : ఎందుకు సరిపోదూ? ఇందాకనే చెప్పారుగా రామానుజంగారు!

రామా: అవును. సరిపోతుంది దివ్యంగా. ఉపయోగించుకుంటానేమో దీన్నే నేను రాజారావుగారికి అభ్యంతరమేం లేకపోతే!...

[ వెంకన్న వస్తాడు ]

రాజా: నాకేం అభ్యంతరంలేదు. అంతగా ఎవళ్ళకీ అక్కర్లేకపోతే నేనే ఓ హత్యచేసి, దీన్ని ప్రసిద్ధికెక్కించాలని కూడా వుంది.

[ ఉరుములు మెరుపులు—దూరాన తలుపులు దభాల్న మూసుకున్న చప్పుడు ]

సుశు: (ఉలిక్కిపడి) అదేమిటి—ఎవరో తలుపులు పగలగొట్టున్నారు!

వెంకన్న: ఎవరూ లేరు బాబూ! గాలిపాటు!

రాజా: ఏం వెంకన్నా?

వెంక: భోజనాలు వడ్డిస్తున్నారు. లేవండిబాబూ!

నళిని: (లేచి) నే వెళ్తాను రాజా యిక.

రాజా: అదేమిటి—డిన్నరికి వుండవూ?

నళిని: లేదులే – నాన్నగారు పట్నంనుంచి రాలేదా – ఈ తుఫాను చూసి అమ్మ దిగులు పెట్టుకుంది. వెళ్తాను. కలుస్తాగా.

రాజా: సరే నీ యిష్టం.

నళిని: (అందరితో) వస్తానండీ.

[ దూరాన [illegible] ]

రాజా : వెంకన్నా ! లాంచీ వచ్చేసట్టుంది - టపా యేమన్నా వచ్చిందేమో తీసుకురా. సలిలనికి స్నానం వెళ్ళేసట్టుకూడా వుంటుంది.

వెంక : సరేబాబూ ! రండమ్మగారూ. (ఇద్దరూ వెళ్తారు)

రాజా : లేవలేం యింకా ?

సుకు : నీకోసమే చూస్తున్నాం.

[ అంతా లేస్తారు నరహరి తప్ప ]

రామా: (చుట్టూ కలయజూచి) ఏరీ కమలాదేవిగారు ?

సుకు : (కొంటెగా, అతితెలివిగా) ఆమాటకొస్తే నారాయణ మటుకేడీ ?

రామా: నారాయణ ? ... ఆఁ - వచ్చింది జ్ఞాపకం ! వెళ్ళారిందాక అలా ప్రవాహతీరాని కిద్దరూ కలసి !

సుకు : ఓహో ! (నరహరిని క్రీగంటచూస్తూ) మరి నరహరిగా రిక్కడే వున్నారు !

మోహ: (విసిగి, మాటతప్పిస్తూ)అతనూ వస్తాళ్ళే, నువ్వు నడవ్వోయ్ భోజనానికి.

[ అంతా నరహరి వంక చూస్తారు. నరహరి కోపంగా చికాగ్గా వుంటాడు. రామానుజం, సుకుమార్, మోహన్ లోపలి కెళ్తారు.]

రాజా: లే నరహరీ నువ్వుకూడా.

నర : వస్తాలే నువ్వు పద.

రాజా: (Shrung చేసి) సారీ బాబూ ! ఈ భైరవలంకలో నే చేసే చివరి విందు యిదే!

[రాజారావు లోపలికి వెళ్తాడు. నగహారి వంచుకుని వున్న తలయెత్తి ప్రేక్షకులవంక చూస్తాడు. Case లోంచి సిగరెట్టు తీసి ఘుమ్మంగా చిరునవ్వు నవ్వి నోట్లో పెట్టుకుని అగ్గిపుల్ల గీయబోతాడు. అతనిముఖం చాలా వికృతంగా, దీనంగా, భయంకరంగా వుంటుంది. వరండాలోంచి ఎవరో వస్తున్న అలికిడి అవుతుంది. అతడు త్వరత్వరగా Switch off చేసి టేబుల్ వెనక దాక్కుంటాడు. దీపంలేదు. గదిలో Table Light వెలుతురు మాత్రమే వుంది. వరండా తలుపులు తెరుచుకుని కమల వస్తుంది. ఆమె వెనకే నారాయణ కూడా వస్తాడు... ] —

కమల: (వస్తూనే) మనం ఎక్కడున్నా మనుకుంటున్నారో, ఏం చేస్తున్నా మనుకుంటున్నారో—

నారా: కమలా !

కమల: వద్దుబావా లోపలికెళ్దాం. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఎవరన్నా వస్తారేమో

నారా: ఎవరొస్తారు. అంతా భోజనాలకెళ్ళి వుంటారు.

కమల: ఐతే మటుకు ? ఖర్మంచాలక మావారే కనక చూస్తే

నారా: అబ్బ ! ఈ కాస్సేపన్నా మరిచిపోలేవా కమలా, వాడెవ్వడవ ?

[చెయ్యిపట్టుకు లాగుతాడు]

కమల: (విడిపించుకుంటూ) అసలే వారికి పుట్టెడనుమానం.

నారా: నీ పిచ్చిగాని – civilzed husbands ఎవరూ కూ ఇలాంటివి ఆట్టే పట్టించుకోరు కమలా ! చూచీ చూ సట్లు వూరుకుంటారు – అంతే !

కమల: అబ్బో మీ మొగాళ్ల సంగతెవరికి తెలీదు ? పుస్తెకట్టి నంత మాత్రాన ఆడది మీ సొత్తనీ – చచ్చినట్టు పడుండాలనీ అనుకుంటారు !

నారా: (నవ్వుతూ) నీ నరహరి అనుకుంటాడేమో అలా అని. నేను కాదు.

కమల: అవునవును. అందుకనే కాబోలు – ఏదో నోరుజారి పొరబాటు మాట అన్నదని పెళ్ళాన్ని పుట్టింటికి తోలి రెండేళ్ళయినా ముఖం చూపించావు కాదు.

నారా: సరళ విషయం వేరు. అయినా రేపు ఇక్కడికి రమ్మని వ్రాశానుగా.

కమల: పోనీ నీ సరళే యిలా చేస్తే ?

నారా: (Slight pause– నెమ్మదిగా నవ్వుతూ) ఏంజేస్తానా... ఉప్పుపాతరేస్తాను ! మళ్ళీ వచ్చి నిన్ను ప్రేమిస్తూ కూర్చుంటాను. సరేనా ?

[ అని తమకం పట్టలేక ఆమెను దగ్గరకు లాక్కుని కౌగలించు కోబోతుండగా...నరహరి గబగబా లేచి లోపలకి వెళ్తాడు కొద్దిగా చప్పుడవుతుంది. అది విని భయపడి......... ]

కమల: ఎవరది ? (నారాయణని విడిపించుకుని వెనక్కు తగ్గు తూంటుంది.)

నారా: ఏమిటి ?

కమల: ఎవరో——(మాట పెగలదు)

[ ఇద్దరూ గదిచుట్టూ చూస్తారు ]

నారా: ఎవరూ లేరే ?

కమల: నా చెవులారా విన్నాను. ఎవరో పసిగట్టుకుపోయిన అలికిడి.

నారా: ఉత్తభయం.

కమల: కాదు బావా! ఎవరో ఇక్కడ దాక్కున్న మాటనిజం!

[ నారాయణ Dining Room వైపు పోబో తాడు. ఉరుములూ – మెరుపులూ...... ]

వద్దుబావా నువ్వు వెనక్కి వచ్చేయ్ –

నారా: (వెనక్కివచ్చి) నాకెవర్నూ కనిపించలేదే.

కమల: నే విన్నాను. ఏదో తలుపుకూడా మూసుకున్న చప్పు డయితే!

నారా: మరేం ఫరవాలేదు – నువ్వనవసరంగా భయపడకు– హోరెత్తిపోతున్న గాలి చప్పుడై వుంటుంది.

[D R తలుపు తెరుచుకుని నరహరి వస్తాడు. అక్కడేవున్న Switch వేసి లైటు వెలిగిస్తాడు. అతికష్టంమీద అణచుకున్న ఉద్రేకం ముఖంలో లీలగా కనిపిస్తోంది. నారాయణ, కమల అతనివైపు తిరుగు తారు. నరహరి చాలా సౌమ్యంగా ప్రవర్తిస్తాడు......... ]

నారా: (గుక్క తిప్పుకుని – సర్దుకుని) హల్లో! – నరహరీ! మా కోసమే చూస్తున్నారా యేమిటి?

నర : భోజనాలు తయారై చాలసేపయింది – మీరు మరిచి పోయారేమో అనుకున్నాను.

కమల: లేదు – ఎప్పుడూ యిలాంటి లంకలకు రాలేదుకదూ– అందుకని...ఆ దృశ్యాలన్నీ చూస్తూ కూర్చున్నాం.

కమల: (బిక్క-మొహంతో క్షణంసేపు మాట్లాడలేక పోతుంది) పో బావా ! నీ వేళాకోళాలూ నువ్వూను. (భర్తతో) ఏమండీ చాలా ఆలస్యమైపోయిందా యేమిటి ? ... కోపగించకండే.

నర : (తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో) కోపమెందుకూ ?

[ కమల లోపలికి వెళ్తుంది తలుపు తీసేవుంచి ]

నారా: (చాలహుషారుగా వున్నట్టు) అవును మా మరదలు పిల్ల ముఖారవిందం చూస్తుంటే ఎవరికి మటుకు ఎలా కోపం రాగలదు ?

[ నారాయణ వాకిలికేసి రెండడుగులు వేస్తాడు. కాని నర హరి తలుపుమూసేస్తాడు. నారాయణ ఆగిపోతాడు.... ]

కదూ నరహరీ ! చాల చక్కటి మొహం ! అవునూ- ఆమె సౌందర్యపాశంలో చిక్కుకున్న వాళ్ళని ఏంచేస్తావ్ ?

నర : ఏంచేస్తే బాగుంటుందంటావ్ నారాయణా ?

నారా: వాళ్ళనలా వదిలేసెయ్. ఆ సౌందర్య వహ్నిలో హుతమై చావనీ.

నర : చావడమా ? ... ఓ ... అవును. అదిచాలా బాగుం టుంది.

నారా: (అతని స్వరంలోని పశుత్వానికి నిశ్చేష్టుడై) ఆం...? (తెప్పరిల్లి) ఆం...ఇక వెళ్దామా ? ఇప్పటికే చాలా ఆలస్యమైందన్నావ్ ?

[అని నరహరి ప్రక్కగా వెళ్ళి D R తలుపు తెరుస్తాడు ]

నర : నారాయణా !...నీతో కాస్త మాట్లాడాలి.

[ నారాయణ అతనివంక తెల్లబోయిచూసి తెరచిన తలుపు మళ్ళీ వేసేస్తాడు. నరహరి మాట్లాడకుండా అతన్ని తదేకంగా చూస్తున్న కొద్దీ అతని హృదయం మరింత విచలిత మౌతుంది.... ]

నారా: ఏం ?...ఏమిటి ?...ఎందుకూ అలాచూస్తావ్.

నర : అబ్బే ఏంలేదు ! చూడడంకాదు—వూరికే యేదో ఆలోచన తట్టింది. ఆఁ...నారాయణా !...మీ ఆవిడకూడా వస్తుందికదూ యిక్కడకి ?

[ నారాయణకు అర్థంకాలేదు ఎందుకడుగుతున్నాడో ]

నారా : అర్థంకాలేదు (ఎందు కడుగుతున్నాడో.)

నర : అఁహాఁ – మీ యిద్దరూ రాజీపడిన తర్వాత ఇక్కడేగా ప్రథమ సమావేశం ?

నారా: అవును...

నర : మరి నువ్వు లాంచీ తీసుకు వెళ్దామనుకుంటున్నావా ఆమెను తీసుకురావటానికి ?

నారా: (బల్లమీద పేపరు తీసుకుంటూ) ఏమో ... వినా అదంతా యెందుకిప్పుడు ?

నర : అబ్బే – యేముందీ ... అఁహాఁ – నీ భార్యకి పాపం నువ్వెక్కడా కనిపించక...ఇక్కడా కనిపించకపోతే...

నారా: (చేతిలో పేపరు టేబుల్ మీద విసిరేసి) అంటే నీ వుద్దేశ్యం ?

నర : ఏముందీ...యేంలేదు...యేమీలేదు.

నారా: ఊఁహూఁ—

[ నరహరి అతని ముఖంలోకి ఆలోచనగా చాలా సేపు చూస్తాడు. నారాయణ వెంటనే వెనక్కి తిరిగి గబగబా లోపలికి వెళ్ళిపోతాడు. నరహరి ముఖం క్రూరంగా సంకుచిస్తుంది. ఒకఅడుగు ముందుకేసి ఆగి సిగరెట్ ను Ash tray లో క్రూరంగా చిదిపి లోపలికి వెళ్ళిపోతాడు. రాజారావు D R లోపల్నుంచి వచ్చి మెట్లెక్కుతూ వుంటాడు. వెంకన్న బయటనుంచివస్తాడు. చేతిలో కవర్లువగైరా టపావుంటుంది ]

వెంక : (రాజానుచూసి) ఇదిగో బాబూ ! టపాతీసుకొచ్చాను.

రాజా: (దిగివచ్చి) ఏమిటోయ్ ఇన్ని ఉత్తరాలు తీసుకొచ్చావ్!

[ టపా తీసుకుని టేబుల్ మీదకు విసిరేస్తాడు ]

వెంక : గాలి జోరుగావుంది బాబూ - వర్షంకూడా వచ్చే ఆన వాళ్ళున్నయ్ ! మీరా సెలవైతే యింటికెళ్తానని లాంచీ డ్రైవరు అడగమన్నాడు బాబూ !

రాజా: హోరి - మనల్నందరినీ ఈ భైరవలంక కప్పగించి తను మటుకు ఒడ్డుకు చేరుకుంటాడా ? సరే పొమ్మను. వుండి మటుకేంచేస్తా డిక్కడ.

వెంక : మళ్ళీ యెప్పుడు రమ్మని చెప్పమంటారు ? అర్నెవర్నో యీడకు తీసుకురావాలి గామోసు రేపు మధ్యాన్న పేళ ?

రాజా: (ఉలిక్కిపడి లేచి) అవునవునోయ్ ! సరళ - బాగా జ్ఞాపకం చేశావ్. మంచిపనే - ఆవిడగారి మొగుడు కూడా వెళ్తాడేమో ఈ లాంచీలోనే అమ్మగారికి స్వాగతమియ్యడానికి - చాలా రోజులతర్వాత మళ్ళా కలుసుకోవడమాయె. (D R వైపుతిరిగి) నారాయణా (అని కేకవేసి మళ్ళీ వెంకన్నతో) ఈ మొగుళ్ళకి చాలా

విపరీతపు బుద్ధులు పుడుతూంటాయి. అసలు పెళ్ళంటే యేమిటో యెరక్కుండా వీళ్ళు పెళ్లెందుకు చేసుకుంటారా అని!

వెంక: అదేంటిబాబూ - పెళ్ళి సేసుకుంటేగందా దానిమజా తెలిసొచ్చేది!

రాజా: నీ కెప్పుడైనా పెళ్లైందా వెంకన్నా?

వెంక: లేదుబాబూ చేసుకుంటే దాని కాపలాతోనే సరిపోయేది గందా.

రాజా: అవునవును. నిజమే. మనం వున్నాం చూశావ్-బ్రహ్మచారులం - మనం నిజంగా అదృష్టవంతులమోయ్.

[ D R వంక నారాయణకోసం చూసి- ]

ఆఁ - చూడు - నారాయణ్ణి ఓసారి పిలుచుకురా!

వెంక: (వెళ్ళబోతూ జ్ఞాపకంవచ్చి ఆగి, జేబులోంచి తీసి యిస్తూ) టెలిగ్రాం బాబూ!

రాజా: (తీసుకుంటూ) ఇదెక్కణ్ణుంచోయ్!

[ వెంకన్న D R లోనికి వెళ్తాడు. రాజా కవరుచించి టెలిగ్రాం చదువుతాడు. వెంకన్న నారాయణ్ణి వెంటబెట్టుకొస్తాడు.... ]

నారా: ఏమిట్రా రాజా?

రాజా: (చూపుతూ) సరళ దగ్గర్నుంచి వైరు...తను రేపు రావటంలేదట!

నారా: అంత చులకనై పోయానేమిటి - రమ్మని నేను వ్రాస్తే సరికి?

రాజా: నాళ్ళమ్మకేదో సుస్తీగావుందట! ఎల్లుండి బయల్దేరుతా నంటోంది.

నారా: అంతేనా... ఇంకేమన్నా వుందా?

రాజా: అంతే.....అవును!

నారా: ఓసారి చూడవచ్చా నేను!

రాజా: ఆఁ? – ఓ – చూడవచ్చా (యిస్తాడు)

వెంక: అయితే ఆడు రేపురారన్నమాట. అంతేకదు బాబూ!

రాజా: ఆఁ...ఎల్లుండి మధ్యాహ్నం...పోసీ లాంచీ డ్రైవర్ని అందాకా అక్కడే వుండమనిచెప్పు. ఏకంగా వాళ్ళని తీసుకునే రావచ్చు.

(దూరాన ఈలుములూ –గాలీ)

వెంక: సరేబాబూ చెప్పొస్తాను. గాలికూడా బాగా లేస్తోంది. ఏక్షణాన ముంచుకొస్తుందో మరి.

రాజా: అచ్ఛా!

[ వెంకన్న వెళ్తాడు ]

[ వాకిలి తలుపులు మూసుకున్న చప్పుడు ]

నారా: (ఉలిగ్రాంలోకి చూస్తున్నవాడల్లా ఉలిక్కిపడి) అదే మిటి?

రాజా: ఏది?...అరె...వెంకన్న వెళ్తూ వెళ్తూ తలుపువేసి పోయాడు – అంతే.

నారా: ఓరిదేముడా! గుండెలవిసిపోయాయి.

రాజా: (కిటికీకేసిపోతూ) నిజమే! ఈ భైరవలంక నిజంగా గుండె దడపుట్టిస్తుంది. రామానుజంగారికి నచ్చిందంటే

ఆశ్చర్యం లేదు. ఇక్కడ పట్టపగలు పట్టుగ్గొంతు కోసినా—

నారా: రాజా—

రాజా: ఓ న్రా! ఇక్కడ ఏం జరిగినా జరగొచ్చు. మా నాన్నగారు కూడా యీ మాటే అంటుండేవారు. ఆయనకీ లంకంటే చాలా విచిత్రమైన ఆలోచనలుండేవి. నేనుమటుకు ఎప్పుడేంఘోర సంఘటన జరిగిపోతుందోనని ప్రాణాలు బిగబట్టుకూర్చునేవాణ్ణి. అలాంటి దింతవరకూ యేంజరగ లేదనుకో; కానిఇప్పటి కూడా ఇక్కడో నాలుగురోజులుంటే చాలు ప్రాణాలు కడబడతయ్! (దూరాన లాంచీ విజిల్) అదుగో లాంచీకూడా వెళ్ళి పోతోంది. మళ్ళీ వాడొచ్చేదాకా మనకిక్కడ బందిఖానాయే! యేం జరిగినా దిక్కూ మొక్కూ వుండదు.

[ కమల డి. ఆర్. లో పల్నుంచి వస్తుంది ]

కమల: (రాజాతో) కాస్త మీరైనా మందలించండి మీ అతిథుల్ని.

రాజా: ఏం? ఏమంటున్నారు?

కమల: ఎంతసేపూ హత్యలూ, హంతకులూ! అదివాణ్ణెందుకు చంపింది. వాడు దాన్నెందుకు చంపేడు – ఇదేగోల! వింటూంటే గుండెల్లో హడలుపుడుతోంది కూడాను.

రాజా: మనం ముగ్గురమే ననుకుంటాను హత్యల్ని అలా హంతకులనుమాత్రం వదిలేసి పూనుకున్నది!

కమల: (నారాయణతో) బావా! రాజారావుగారితో కాస్త వంటరిగా మాట్లాడాలి. నువ్వు అవతలికి వెళ్తావ్ ?

నారా: తప్పకుండానూ. (వెళ్తూ ఆగి) కాని–కనుసన్నల్లో మెలిగేవాళ్ళం — మరీ అంత మొహాన - అన్నట్లు జాగ్రత్తగోయ్ రాజా! (కమల వంక సాభిప్రాయంగా చూసి) ఇందాక సరహారి నా వంక చాలా తీక్ష్ణంగా చూశాడు!

కమల: పో బావా! (నారాయణ వెళ్తాడు. కమల ఆందోళనతో చేతిలోని రుమాలు నలుపుతూంటుంది. రాజారావు గమనిస్తాడు.) నాకు చాలా భయమేస్తూంది రాజారావుగారూ! తలుపులన్నీ వేసేవున్నాయి గదా!

రాజా: (Puzzle అయి) వేసే వున్నాయి. ఏమిటసలు సంగతి ?

కమల: ఈ లంకలోకల్లా మనమేనా మనుషులం ?

రాజా: ఆ—?

కమల: అదే—మనమూ—మన పార్టీ తప్ప ఇంకెవరూ లేరూ ?

రాజా: మా నళిన్ని చూశావ్ గా– అదీ, వాళ్ళమ్మా, నాన్నా ఆయనేలే మా మేనేజరుగారు — పోతే పని మనుషులూ, ఒకరిద్దరు జాలర్లూ తప్ప మరెవరూ లేరు. (కొంటెగా, భయపెడదామని) వీళ్ళని మినహాయిస్తే మన చుట్టూతా అంతులేని గాలీ–అగాధపు నీళ్ళూ— అదటుపుట్టించే హత్యా రహస్యాలూనూ!

కమల: ఓహో! ఇక్కడ హత్యలుకూడా జరుగుతుంటాయా యేమిటి ?

రాజా: నాకు తెలిసినంతవరకూ యేం లేదనుకోండి. ఐనా జరిగినా జరగొచ్చు ననిపించడంలేదూ మీకు ?

కమల: అబ్బ ! యేమండీ—

రాజా: ఓ—క్షమించండి. వాళ్ళందరి పిచ్చే నాకూ పట్టినట్టుంది కాస్త...ఆఁ...అసలు సంగతేమిటి ? ఏం జరిగింది ?

కమల: మీ రందరూ భోజనాలదగ్గ రున్నారు చూడండి— అప్పుడు నేనూ మా బావా ఇక్కడకొచ్చి మాట్లా డుతూ నుంచున్నాం—

రాజా: ఎలాగైనా మీ బావ అదృష్టవంతుడు !

కమల: నేను చాలా Serious గా మాట్లాడుతున్నాను. మే మిద్దరం అప్పుడే గార్డెన్‌లోంచి లోపల కొచ్చాం— అంతే—ఒక్క క్షణంకూడా అవలేదు—ఆఁ...ఆఁ... ఇంకా లైట్లుకూడా—

రాజా: (చిరునవ్వుతో) అదే—అదే—లైట్లు వెయ్యటానిక్కూడా వ్యవధి లేకపోయింది—అప్పుడే వచ్చారు. అంతేకదూ ?

కమల: (ఒకసారి చురచురాచూసి) ఆఁ – అంతే...అంతలోనే ఎవరో నడిచినట్టూ—పరుగెత్తి పోయినట్టూ ఈ గదిలోనే వినిపించింది. ఏదో తలుపుకూడా ధడాల్న మూసుకుంది. ఇటుతిరిగి చూసేసరికి ఎవరూ లేరు. నిజంగా నాకు చాలా భయం వేస్తోందండీ !

రాజా: (ఈమాటకు పరిహాసం మానేసి) అంటే – మీ మీద ఎవరైనా సి. ఐ. డి. పని చేస్తున్నా రంటారా ?

కమల: (త్వర త్వరగా) అబ్బే! అంతఅవసరం యేముందయినా—అహాఁ — నేననే దేమిటంటే — వాడెవడైనా దొంగ వెధవేమోనని.....

రాజా: (సాలోచనగా) సామాన్యంగా భైరవలంకకి దొంగ వెధవ లెవరూ రారు. అందులోనూ యిలాంటి రాత్రి...

కమల: పోనీలెండి — నేనే యేదో భ్రమపడి వుంటాను.

రాజా: పోనీ వెంకన్నని ఓసారి లంకంతా చుట్టబెట్టి రమ్మంటాను. ఆ సనంటే నిద్రాహారాలుకూడా అక్కర్లేదు వాడికి!

కమల: వద్దులెండి పాపం — అనవసరంగా శ్రమ. (లేస్తూ) సరే నే లోపలికి వెళ్తాను.

రాజా: వాళ్ళకి కొన్ని ఉత్తరాలొచ్చాయి. తీసుకెళ్ళి ఇస్తారూ? (ఇస్తాడు)

కమల: ఓ — (తీసుకుని వెళుతూ) మీరూ రారూ?

రాజా: ఇప్పుడే ఒక్క క్షణంలో వస్తాను.

[ అని Dr. R లోనికి వెళ్తాడు. కమల ఆగి చేతిలో ఉత్తరాలు చూస్తుంది. ఒక కవరు తీసుకుని మిగతావన్నీ బల్లమీద పెడుతుంది. తీసుకున్న కవరు చించి కాగితం బయటకుదీసి చించిన కవరుకూడా బల్లమీద పెడుతుంది. కాగితం చదువుతూన్న కొద్దీ ముఖంలో జెలసీ అసహ్యం, కోపమూ కనిపిస్తాయి. చదివి కాగితంచించి చిత్తుకాగితాల బుట్టలో పారేస్తుంది. బల్లమీద ఉత్తరాలన్నీ చేతబట్టుకుని డి. ఆర్. లోకి వెళ్తుంది. చించిన ఖాళీకవరుకూడా ఆ ఉత్తరాల్లోనే వుంటుంది. అప్పుడే వరండాలోంచి లోపలికొచ్చిన నళిని వెళ్ళిపోతున్న కమలను చూస్తుంది. నళినివచ్చి టేబుల్ మీద పుస్తకాలు ఆరగేస్తుండగా Dr. R లోంచి రాజారావు వస్తాడు. ]

రాజా: ఏం నళినీ మళ్ళొచ్చావ్ ?

నళిని : ఇందాకా ఒక పుస్తకానికి ఇంకొకటి తీసుకెళ్ళాను...

రాజా: ఏదీ ? (తీసుకు చూసి) 'రక్తదాహం' : రచయిత రామానుజం...హుఁ...చెత్త...

నళిని : అదేం చెత్తకాదు. చదువుతూన్నంత సేపూ ప్రాణం కొట్టుకుపోతే, భయంతో గుండె దడదడ లాడుతూ !

రాజా: ఏమిటంత సరదా ప్రాణం కొట్టుకుపోతుంటే ?

నళిని : అంత బాగుంటాయి ఆ కథలు !

రాజా : కథలు...! ఊఁ...మీలాంటి వాళ్ళంతా నిజమైన హంతకుడు ఎదటపడితే యేంజేస్తారా అని !

నళిని : రాజా___!

రాజా: ఔను నళినీ ! ఇక్కడ ఏం జరిగినా జరగొచ్చు నంటాను.

[ గంటలు వినిపిస్తాయి ]

నళిని : మన చిన్నతనంలో మీ నాన్నగారు అదేమాట అంటూండేవారు. జ్ఞాపకం వుందా ?

రాజా: చిన్నతనంలోనా ? పెద్ద వృద్ధనారిలా మాట్లాడు తున్నావే ! సెలవులైపోగానే పోయి దేవుడా అంటూ కాలేజీలో చేరాలి మళ్ళీనూ !...సెకండియరేనా ?

నళిని : సెకండియర్ మొన్నటి మార్చితోనే అయిపోయింది సార్ ! (రిస్టువాచీ చూపుతూ) నీమతిమరుపుకు చిహ్నం ఇదిగో ! పాస్ అయినట్లు రిజల్టుస రాగానే నువ్విచ్చిన బహుమతి !

రాజా: నే నెందుకిచ్చా నది? అయినా ఇంకా తిరుగుతోందీ?

నళిని: ఆహాఁ... (అయినా ఆదుర్దాగా చెవిదగ్గర పెట్టుకు చూసి) ఓ...దివ్యంగా తిరుగుతోంది. రాజా! నిజం చెప్పవూ ఇప్పటికైనా?

రాజా: ఏమిటది?

నళిని: రిజల్ట్సు వచ్చిననాడు నా గదిలో బల్లమీద ఈ గడియారం వుంచిందెవరు?

రాజా: ఇదుగో అమ్మాయ్! నీ కెన్నిసార్లు చెప్పాను-నన్నా సంగ తడగొద్దు, నాకేం తెలీదని?

నళిని: ఇదుగో అబ్బాయ్! నీ కెన్నిసార్లు చెప్పాను - ఆ అబద్ధాలు కట్టిపెట్టమని?

రాజా: ఇదుగో అమ్మాయ్! నన్నలా పిలిచేటప్పుడు కాస్త చిరునవ్వుకూడా కావాలి.

నళిని: ఆహా! రామానుజంగారి నవలల్లో మనుష్యుల్లా మాట్లాడుకుంటున్నాం.

రాజా: హరి భగవంతుడా! ఈ కొంపలో రామానుజమూ వాడి చెత్తరాతలూ తప్ప ఇంకేమీ లేదా ఏమిటి మాట్లాడటానికి.

నళిని: నువ్వెప్పుడైనా చదివావా అవ్వి?

రాజా: ఆ దుర్దశ మనకింకా పట్టలేదులే. Time waste!

నళిని: దుర్దశ అనుకుంటే నా కెందుకొచ్చింది. నే వెళ్తాబాబు

[ పుస్తకం తీసుకుని వెళ్ళబోతుంది. రాజారావు ఆపుతాడు. ]

రాజా: కోపం వచ్చిందా నళినీ?

నళిని : నాతో ఎందుకులెద్దూ - నీకు Time waste

రాజా: నీతో Time waste చెయ్యటం నాకిష్టం నళినీ !

నళిని : ఆఁ - అల్లాగా ! (అని విడిపించుకుని వరండాలోకి పరుగెత్తుతుంది.)

[ రాజా ఆమె వెళ్ళినవైపే ఓ క్షణంచూసి తలుపుమూసి మెల్లెక్కుతూంటాడు. ఇంతలో డి. ఆర్. లోంచి నారాయణ నెమ్మదిగా వస్తాడు. అ సవ్వడివిని రాజా రావు బాల్కనీమీద ఆగుతాడు. కాని నారాయణ అతన్ని చూడడు - ఉబుములూ మెఅపులూ - టేబుల్ మీదవున్న వుత్తరాలన్నీ గబగబాచూసి ఒకటి తీస్తాడు. వణుకుతున్న చేత్తో కవరు తెరవబోతాడు. రాజా నెమ్మదిగివస్తూ —]

రాజా: ఏం నారాయణా ! ఏమిటి వెతుకుతున్నావు ?

నారా: (ఉలిక్కిపడి కవరు దాచటానికి ప్రయత్నిస్తూ) ఆఁ... అబ్బే...నాకేమన్నా ఉత్తరాలు వచ్చాయేమోనని చూస్తున్నాను.

రాజా: ఇక్కడున్నవన్నీ నావే ననుకుంటాను. మిగతావన్నీ కమలకిచ్చి పంపానే లోపలికి. (దగ్గరకొచ్చి అతని చేతిలోని కవరుచూసి) ఓ ! యేదో దొరికినట్లుందే మొత్తానికి !

నారా: (With an embarassed laugh) లేదు. ఇది...ఇదినీదే (తిరిగియిస్తూ)

రాజా: (దానివంక చూస్తూ) మరి ?

నారా: అది మా యావిడ దగ్గర్నుంచి కదూ ?

రాజా: అలానే కనిపిస్తోంది దస్తూరీ.

నారా: ఆఁ – అందుకనే! నాక్కూడా ఓ ఉత్తరం రాసి అందులో వుంచిందేమోనని...

రాజా: వుంటే నే చెప్పనూ?

నారా: ఓ – ఐతేసరే – Thanks... వస్తానూ. (D. R. లోకి వెళ్ళబోతాడు.)

రాజా: ఆగు! (కవరుచించి వుత్తరంతీసి చదువుతాడు – కాళీ కవరు చిత్తుకాగితాల బుట్టలోపారేసి) ఏమీలేదు – రాలేనని టెలిగ్రాంయిచ్చిందే–ఆ సంగతే వుత్తరంలో కూడా రాసింది. కాని భైరవలంకకి వుత్తరమూ వైరూ ఒక్కసారే జేరాయి...వాళ్ళమ్మ వెళ్ళమని బలవంతంచేసినా తనే బావుండదని రేపటికి ఆగి ఎల్లుండి తప్పకుండా వస్తానని వ్రాసింది...చూడు

[ ఇస్తాడు. నారాయణ చదువుతూంటేగా రాజా డ్రాయరులోంచి రివాల్వరుతీసి చూస్తుంటాడు. తోటాలుకూడా వెతుకుతాంటాడు. ]

నారా: ఇంతేకదా వస్తాను.

రాజా: కొంచెం ఆగు. నీతో మాట్లాడాలి.

(రివాల్వరు నారాయణవైపు తిరిగి వుంటుంది. ఒక Tray లో పాలగ్లాసుపెట్టుకుని వచ్చిన వెంకన్న యిది చూసి త్రుళ్ళిపడతాడు. వెంకన్ననిచూసి రాజారివాల్వరు దాయబోతాడుగాని, లాభంలేదని మానేస్తాడు)

సరే నువ్వెళ్లు నారాయణా! తర్వాత మాట్లాడుదాం.

(నారాయణ వెళ్తాడు)

వెంక.: (తెప్పరిల్లి) భోజనం కూడా సరిగ్గా చెయ్యలేదుగా బాబూ! యిన్నైనా పుచ్చుకోండి, పాలు తెచ్చాను.

రాజా: (రివాల్వరు జేబులో పెడుతూ) మంచిపని చేశావు వెంకన్నా...(వెంకన్న Tray బల్లమీద వుంచుతాడు.) వెంకన్నా!...ఖర్మించాలక ఇవ్వాళరాత్రి నా అతిథుల్లో ఎవరికైనా యేదైనా ప్రమాదం సంభవిస్తే నువ్విప్పుడు చూసిన విషయం చెప్తావు గదూ?

వెంక: నేనేం చూశాను బాబూ! – నాకేం కనిపించలేదే – నేనేం యెరుగుదును?

రాజా: (Hearty గా నవ్వి) భలేవాడివి వెంకన్నా! మంచి వాడివి...ఊఁ...(పాలు తాగుతుంటాడు.)

వెంక: ఫరవాలేదంటే చెప్పండిబాబూ! యెప్పుడు జరుగుతుందది?

రాజా: యేది?

వెంక: అదే – ఏదో ప్రమాదమన్నారు...

రాజా: అదా!...అదసలు జరక్కపోవచ్చు...అది అనేక విషయాలమీద ఆధారపడి వుంటుంది...కాని ఒకటి మాత్రం ఖాయం – (ఉరుముల చప్పుడు) నా అతిథుల్లో ఎవరన్నా మాయంకావడమే కనక సంభవిస్తే దానికితగ్గ కారణంమటుకు వుంటుందని గుర్తుంచుకో.

వెంక: వుంటుందిబాబూ! తప్పకుండా వుంటుంది.

[ రాజా పాలగ్లాసు Tray లో పెడతాడు. వెంకన్న Tary తీసుకుపోతూ ద్వారందగ్గర లోపలకొస్తున్న గాయత్రీబాయికి దారియిచ్చి లోనికి వెళ్ళిపోతాడు. ]

రామా: ఓ - రాజారావుగారు ! ఉన్నారే విూరిక్కడే !...
చూశానిందాక నా పుస్తకం ఒకటి టేబులువిూద. అది కావాల్సి - (టేబుల్ విూద వెతుకుతుంటాడు)

రాజా: ఏమండీ - నాకు తెలీకడుగుతాను - విూ పుస్తకాలు విూరే చదువుకుంటూ కూర్చుంటారా ?

రామా: లేదండీ ! - Explai n చేస్తూ వాళ్ళకి 'నరపిశాచి' విషయం Verify చేద్దామని వచ్చానో సంగతి...లేదే పుస్తకం యిక్కడ. అయినా లేవులెండి డొంక తిరుగుళ్ళేవిూ అందులో Problem కి - ఉత్త పశుత్వం ! మిష్టరీ ఏంలేదు. చాలా క్లియర్ గా కనిపిస్తుంది మోటివ్ !

రాజా: సామాన్యంగా విూరంతా Plain murders జోలికి పోరనుకుంటాను.

రామా: లేదండోయ్ అభ్యంతరం మనకి ఏవిధమైన murders అయినాసరే! చేసిచూశాను అన్ని రకాల హత్యలూనూ- అదే - వ్రాతలోనే లేండి !

రాజా: నిజంగా బలేపని పెట్టుకున్నారండీ విూకు జీవితంలో !

రామా: అవునండీ - చాలా అగాధమైన విషయం యిది. కాని అర్థంచేసుకోగలిగితే మానవనైజాన్నే కనక -

రాజా: విూలోని ప్రత్యేకత అదేననుకుంటాను - మానవ తత్వాన్ని అర్థంచేసుకోగలిగి వుండటం !

రామా: (అదేముందండీ అన్నట్లు) అంతా Training అండీ — చేశాన్నేను మానవచర్యల కారణాల్ని గురించి పెద్ద Study! ముఖ్యంగా హంతకుల —

రాజా: కాస్త విస్కీ యేమన్నా తెప్పించమంటారా?

రామా: (నిర్ఘాంతపోయి) No, thanks. లేదండీ నా కలవాటు.

రాజా: యేమిటి! అంటే —'మీ పుస్తకాలన్నీ వాళ్ళేరిగిన స్థితిలోనే రాస్తారా?

రామా: మరి! ... రాజారావుగారూ! అడుగుతా నొక్క విషయం——

రాజా: తప్పకుండానూ—

రామా: లేదుగదా మనిద్దరికీ అట్టే పరిచయంకూడా...ఎందుకు పిలిచినట్టు మరి మీరీవిందుకి నన్ను?

రాజా: చెప్తాను గాని (దగ్గరకువస్తూ) కాస్త రహస్యంగా వుంచుతారా?

రామా: రహస్యంగానా? (ఉరుములు)

రాజా: హత్యనుగురించి కొన్ని సంగతులు తెల్సుకోవాల్సి వచ్చింది. ఆరంగంలో పేరెన్నికగన్న మీరైతే బాగుంటుందని—

రామా: ఎందుకూ?

రాజా: ఎప్పుడో ఓసారి నేనే ఒక హత్యాకాండ ప్రారంభిస్తానని.

రామా: What !!

[D R లోపల కంఠస్వరాలు]

రాజా: నా మిత్రులంతా కూడా హత్యలన్నా, హంతకులన్నా మీ పుస్తకాలన్నా చాలా కుతూహలంగా వున్నారు– నేనుమటుకెందుకుండరాదనీ...!

రామా: ఓ – నా పుస్తకాలంటేనా! అవునుపాపం! అవ్వి అందరికీకూడా చాలా బాగున్నట్లున్నయ్!

[D R లోంచి మోహన్ వెనకాలే నరహరి,
సుకుమార్, నారాయణ వస్తారు.]

మోహ: ఇదుగో రామానుజంగారూ! దయచేసి మీరైనా చెప్పండి ఇతను చెప్పేది చాలా తప్పని.

రామా: ఏదీ?

మోహ: అదే 'నరపిశాచి' సంగతే! హత్య జరక్కుండా వుండాలీ అంటే మరణభయం కలిగించాలంటాను. హత్యకు తగ్గశిక్ష ఉరిశిక్షేనంటే నరహరి అదేంలాభం లేదంటాడు.

నర : Statistics చూడరాదూ తెలుస్తుంది.

రామా: ఏమని?

నర : ఏమనేమిటి? ఎన్ని ఉరిశిక్షలు విధించినా హత్యల దోవన హత్యలు జరుగుతుంటాయి. వాటిని అరికట్ట డానికి యెన్ని శాసనాలు, చట్టాలూ చేసినా సరే.

సుకు : Science of criminology ప్రకారం___

మోహ: ఓరి నీ Science of criminology పట్టుబండలు కానూ, యిప్పుడు మాట్లాడేది చాలా పెద్దవిషయం నువ్వు నోరుమూసుకు వినరా.

రామా: (తనకే పెద్ద తెలుసునన్నట్లు చిరునవ్వుతో) ఏమిటి మీ నిర్ణయం నరహరిగారూ ?

నర : హంతకుల్లో రెండు రకాలున్నారు. సామాన్యంగా చాలామంది తాత్కాలికోద్రేకంతో ముందువెనుక లరయలేని మొరటువాళ్ళు. వీళ్ళకి శిక్షా భయం వుండదు—చట్టం నిరుపయోగం.

మోహ: ఇదుగో—

నర : పోతే – వివేకవంతులు కూడా కొందరు కొన్ని కొన్ని పరిస్థితుల్లో హత్యకంటే గత్యంతరంలేదనే నిర్ణయానికి రావచ్చు. అలా నిర్ణయానికి వచ్చినవారు శిక్షలకీ, శాసనాలకీ అసలే భయపడరు. తాము పట్టుబడమనే నమ్మకంవుంటే ఆ నిర్ణయాన్ని కడంటా కొనసాగించ వచ్చు కూడానూ !

మోహ: అంతకంటే ఎక్కువ నమ్మకంతో Murder చేసిన వాళ్లే పప్పులో కాలేశారు.

నర : ఎందుకేస్తారు ? వళ్ళుదగ్గర పెట్టుకు పనిచేస్తే ?

మోహ: ఏ కేసయినా తీసుకుచూడు—ప్రతికేసులోనూ హంతకుడు దొరికిపోతాడు ఎందుకని !...వాడూమనిషేగనక. ఏదో ఒక చిన్నపొరపాటు – యేజేబురుమాలో, యే సిగరెట్టో సాక్ష్యంగా వదిలేసి పోవడం సహజంగనక !

రామా: పోనుఁ నే నెప్పుడూ సాక్ష్యాల జోలికి. తెలుసుకో వాల్సిందసలు కారణం! జరిగిన హత్యకు కారణ మేమిటో తెలుసుకుంటే దొరికిపోతాడు హంతకుడు!

[ ఉరుములు – మెరుపులు – వానసాగినచప్పుడు ]

సుకు : ఓహ్ – అసలే గుండెలు దడదడలాడుతున్నాయ్ – యీ వురుముల్లోనూ మెరుపుల్లోనూ – ఆపండయ్యా బాబూ పోనీ కాస్సేపు మీ హత్యలగొడవ.

మోహ: వర్షం కూడ జోరుగా సాగుతోంది. పెద్ద తుఫాను లోకే దించే టట్లుంది.

సుకు : ఆఁ – తుఫానంటే జ్ఞాపకం వచ్చింది–(ఇంతలో D R లోంచి కమల వస్తుంది. ఆమెనుచూసి మళ్ళీ మొద లెడతాడు సుకుమార్) తుఫానంటే చెప్తున్నా...పది పదిహేనేళ్ళ క్రిందట కూర్చున్న చోటునుంచి కదల కుండా తెలుగునాడంతా గడగడలాడించి గగ్గోలెత్తిం చిన గజదొంగ ఒకడుండేవాడట మన గన్నవరం తాలూకాలో !

మోహ: కూర్చున్న చోటునుండి కదలకుండానా? అయితే వాడిది నందిగామ తాలూకా.

సుకు : కాదు గన్నారం

మోహ: నందిగామ !

సుకు : వాడు మరిడమ్మ గుట్టపక్కనే కాపేసేవాడు. అది–

మోహ: అది నందిగామ తాలూకాలోనే ! జగ్గయ్యపేటకి మూడుమైళ్ళవతల !

సుకు : పోనీ నీ మాట ప్రకారమే కానీ అదెక్కడున్నా యిప్పుడు మునుచుకుపోయిందేం లేదు.

రామా: జరిగిందేమిటసలింతకూ ?

సుకు : కంబళీ కప్పుకొచ్చేవాడు. జ్యోతుల్లా కళ్ళు, బొర్రమీసాలూ - దుబ్బుతలా - కాలయముళ్ళా కని పించే వాడట !

మోహ: చేతిలో ఒక బడితె, ఒక గొడ్డలీకూడా వుండేవి !

సుకు : (Exasperated గా అతసివంక చూసి) అవున్లేవయ్యా బాబూ నన్నే మన్నా చెప్పనిస్తావా లేదా ?...సరే - వచ్చేపోయ్యే వాళ్ళందర్నీ నిలబెట్టి 'తే స్తేమనిపి.నికాను. పెట్టక్కడ సొమ్మంతా' అని బెదిరించేవాడట.

నర : వాడిపేరు ?

సుకు : జుజ్జు వెంకడు.

మోహ: కాదు - కొంగర మల్లాయ్ !

సుకు : వాడిపేరు జుజ్జెంకడని నాకు స్పష్టంగా జ్ఞాపకం వుంది.

మోహ: కొంగర మల్లాయ్ - నందిగామతాలూకా - పేటకి మూడుమైళ్ళవతల - మరిడమ్మ గుట్టమీద !

సుకు : సరేకానీ - నాకసలు వాదస్సంటే అసహ్యాం.

రామా: చెప్పబోయూ ఏదో తుఫాన్ను గురించి?

సుకు : ఆఁ - తుఫాను - దానిసంగతే మర్చిపోయాను - అస లంతకు ముందునుంచే ప్రళయంగా తుఫాను - ప్రచండ మైన గాలి - ధారాపాతంగా వర్షం - అంతా నానా

భీభత్సంగావుంది. అలాంటి సమయంలో పసలాంటి జమాజెట్టీ ఒకడు ఆ దోవనపోతుంటే 'ఏయ్ ! నిలక్కడ' అని గర్జించాడు. మనవాడు ఇలాంటివాటికి భయపడేరకం కాదులే – 'ఎందుకురా ?' అన్నాడు. "నేనెవర్నో తెలుసా కొంగల మల్లాయిని ! లేచానంటే డొక్కచీరేస్తాను. పెట్టక్కడ జేబులో వున్న దంతాతీసి" అన్నాడువాడు. 'లేవరాచూద్దాం' అని మనవాడు ! వాడెంతసేపటికీ లేస్తే మనిషినికానని వెనక్కీ ముందుకీ వూగిపోవడమేగాని లేచిరాడే ! ఆ పాట్న మనవాడే వెళ్ళి జుట్టుపట్టుకు నాలుగు బాది లేవదీయబోయాడు. వాడెంతసేపూ పీక్ణెపట్టుకు వేళ్లాడుతాడేగాని లేవడే మనిషి !

రామా: ఏం ?

సుకు : ఎట్లా లేస్తాడు – కాళ్లు లేవు !

రామా: లేవూ ?

సుకు : లేవు. . .కుంటివాడు. . .అవిటివెధవ !

[ అంతా విరగబడి నవ్వుతూంటారు. ఉన్నట్టుండి యింటివెలుపల నుంచి వికృతమైన ఆర్తనాదం వినిపిస్తుంది. అంతా ఉలిక్కిపడతారు. వెంటనే రివాల్వరు ప్రేలినశబ్దం – అంతా భయాకులితులై లేచి నిలబడతారు. రాజా వరండా వాకిలి లోంచి తాపీగా చేతిలో పిస్టలుతో ఆడుకుంటూ వస్తాడు. ]

సుకు : ఏ – ఏమిటది ?

వర : రివాల్వరు ప్రేలిన చప్పుడైంది ?

రాజా: రివాల్వరా? – ఓ – ఇదే – ఇది పేలిన చప్పుడే ఐవుంటుంది. (రామానుజం దగ్గరకువచ్చి) మ్యూప్షో రెండు కాలిబర్ — చిన్నదైతే అయింది కాని మాంఛి effective – సద్యః ఫలితం!

కమల: ఎవరో వెర్రికేక పెట్టారు?

రాజా: ఓ–అదా–మీరు విన్నది నారాయణ చేసిన ఆర్తనాదం అయివుంటుంది.

అంతా: నారాయణా!

కమల: (In horror) బావ?

రాజా: అవును.

కమల: (అడగటానికి ధైర్యంచాలక, అడగలేక అడుగుతూ) ఎందుకూ–ఎందుకు అలా కేక పెట్టాడు?

రాజా: చావడాని కిష్టంలేక!

కమల:
సుకు : } ఓహ్!—

నర : ఏమిటి–ఏం జరిగిం దసలు?

రాజా: ఏముందీ – ఇదుగో ఈ రివాల్వరుతోనే కాల్చి చంపే శానూ!

[ కమల అతికష్టంమీద వస్తూన్న వెర్రికేక అపుకుంటుంది. అందర్నీ ఆశ్చర్యమూ, భయమూ ఆవరిస్తాయి ]

రామా: Good God—Mr. Raja Rao!

కమల: నిజంగానా – నిజమేనా ఆయన సనేది?

నర : అబ్బ! నిజంగా పాడలగొట్టావోయ్ అందర్నీనూ! ఏదీ నారాయణ?

రాజు: కిటికీ తెరిచి కాస్త తొంగిచూస్తే కనిపిస్తాడు. నదిఒడ్డున చచ్చి పడివున్న నారాయణ యిక్కడి కెలా కనిపిస్తాడు?

[ నరహరి కిటికీ దగ్గరకు వెళ్ళి బయటకు చూస్తూవుండగా ఉరుములూ, మెరుపులూ—జోరుగా వర్షం, గాలి వీదుస్తూ వుంటుంది. గదిలో అంతా ఊపిరి బిగబట్టి నిరీక్షిస్తూంటారు. రాజా అందరివంకా — Quizzical గా చూస్తూంటాడు. ఏదో చూసిన నరహరి ఉలిక్కిపడి సౌంజ్ఞ చేయగా రామానుజం కూడా వెళ్ళి చూస్తాడు ]

మోహ: ఏమిటది?

సుకు : నే చెప్పలే, యేదో కొంప మునుగుతుందని?

మోహ: (ముందుకొస్తూ) ఏం కనిపించింది?

సుకు : నువ్వు వెనక్కి రారా మోహనా.

రామా: కనిపిస్తోంది నీళ్ళవారే మానవ కళేబరం ఒకటి.

నర : అది నారాయణదే. సందేహం లేదు.

[ కమల సోఫాలో కూలబడుతుంది. ]

సుకు : ఓహ్హో !

[ మోహన్ కిటికీ కేసి పోతాడు. ]

సుకు : అంతా అలా నిలబడతారేం కొయ్యబొమ్మల్లాగా? యేమన్నా చెయ్యండయ్యా బాబూ ఎవరన్నా!

రామా: (వరండా వాకిలి కేసి వస్తూ) వెళ్ళిపద్దాం రండి నరహరి గారూ, మనం అక్కడికి. First aid కూడా వచ్చు నాకి 'కాస్త.

నర : (కిటికీలోంచి చూస్తూ) లాభం లేదు. పెద్ద అలవచ్చి లోపలికి లాగేసింది. అదుగో కొట్టుకుపోతున్నాడు.

రామా: ఉన్నదిగా లాంచీ. అందులో పోయి రక్షించి తెద్దాం రండి.

రాజా: ఆగండి ఒక్కక్షణం రామానుజంగారూ! (రివాల్వ రతనికి గురి పెట్టి) ఎక్కడివాళ్ళక్కడే గప్ చుప్. మీరిక నారాయణకు చేయగల్గిందేమీ లేదు. అతను చచ్చిపోయాడు.

కమల: (Hysterically) నువ్వే చంపావతన్ని!

[ నరహరి వాకిలికేసి వెళ్ళబోతాడు. ]

రాజా: (రివాల్వరు తనవైపు తిప్పి) ఒద్దు నరహరీ! . . . కాలు కదపటం ఒంటికి మంచిది కాదు. (నరహరి వెనక్కు తగ్గుతాడు.) అంతాకూడా దయచేసి ఆ గోడవరకు వెళ్ళి చేతులెత్తి నిలబడండి. ఊc—హుం! చీకటి — ఉరుములు — మెరుపులు — తుఫాను — చాలా అనుకూలంగా వున్నదిగదూ వాతావరణంకూడా యిప్పుడు! మీ మొత్తం ధనంపోసినా హత్యాకాండ కళ్ళారా చూసే అవకాశం వస్తే వదులుకోరు కదూ! శ్రమ పెట్టి మిమ్మల్నందర్నీ యిక్కడికి లాక్కొచ్చినందుకు మీ అభిరుచి గ్రహించుకుని చంద్రుడికి నూలుపోగన్నట్లు ఒక్క హత్య

మాత్రం చేయగలిగాను. దాంతో సంతోషపడండి...
ఏవీ — మీ మందహాసభాసుర వదనారవిందాలు నా
కన్నుల పండువగా కనిపించేటట్లు నిలబడండి.—

[ అంతా భయంతో ఒకరి నొకరు చూసుకుంటారు. ]

రామా: రాజారావుగారూ !

రాజా: తమరు నోరుముయ్యండి రామానుజంగారూ ముందు.
మీరూ మీ భట్రాజులూకూడా గత నలభై ఎనిమిది
గంటలనుంచీ హత్యలూ, హంతకుల్ని గురించేగా
మాట్లాడుకోవడం ! ఇదుగో యిప్పుడు నిజమైన సమస్యే
కూర్చుంది మీ ముందు. ఎలావుంది ? ఏంచేస్తారు మరి
మీరు దీన్నిగురించి ? వెళ్ళిపోయిన లాంచీ మళ్ళీ వచ్చే
దాకా మనందరి కాళ్ళకీ ఈ భైరవలంకలో సంకెళ్ళే !
రివాల్వరుకూడా నా ఒక్కడిదగ్గరే వుంది. ఎవరైనా
కాస్త అతితెలివి చూపించబోయారా—కబురు చెప్ప
డానిక్కూడా ఎవరూ మిగలరు !...ఇవ్వాళ రాత్రి నే
నొక మహాద్భుత రహస్యం కనిపెట్టాను—మానవ
ప్రాణాలు తియ్యడమంత చులకనైనపని మరొకటి లేదు!

రామా: పిచ్చెక్కిపోయి వాగుతున్నాడు.

సుశు : అరె—పేలిపోతుందేమోనయ్యా బాబూ—అది !

[ రామానుజం అతని నోరు నొక్కబోతాడు. ]

రాజా: మరేం భయపడక్కర్లేదు రామానుజం ! యివ్వాల్టికి
నా ఆకలి చల్లారింది. (మెట్లకేసి వెడుతూ) ఒళ్ళు

దగ్గరపెట్టుకు సంచరిస్తే లాంచీ మళ్ళీ వచ్చేదాకా మీకేం ఫర్వాలేదు.

సుకు : వచ్చిం తర్వాత ?

రాజా: మిమ్మల్నందర్నీ యిక్కడ స్వేచ్ఛగా వదిలేసి—ఆ లాంచీ యెక్కి వెళ్ళిపోతాను... నేనొక్కణ్ణే ! (అంతా నిర్ఘాంత పోతారు. రాజా నవ్వుతూ) హత్య చేసినవాడెవడా అన్న విషయంలో అణుమాత్రం సందేహం వుండదు గాని—హంతకుడు పట్టుబడని హత్యగాథ యిదొక్కటే ధరణిలో! Good night please, everybody ! హాయిగా నిద్రపోయి, మీకుకూడా మరిన్ని హత్యలు చెయ్యండి కలల్లో !

[ గదిలోకి వెళ్ళిపోతాడు. అంతా ఆశ్చర్య విభ్రాంతులై ఒకరు ముఖా లొకరు చూసు కుంటూంటారు ]

— తెర —

## రెండో అంకం

రంగం: అదే; సమయం: 15 నిముషాల తర్వాత.

(శిరసులు వగ్గిస్తూనే వుంటాయి. సుధా చెలరేగి వుంటుంది. నళిని కిటికీగుండా బైటికి చూస్తూవుంటుంది. రామానుజం గది అంతా పచార్లు చేస్తూవుంటాడు - మధ్య మధ్య రాజా గదివైపు చూస్తూ. మోహన్ కాళ్ళు ఊపుతూ టేబులుమీద బాదుతూ కుర్చీలో కూర్చుని ఎక్కడో ఆలోచిస్తూంటాడు. సుకుమార్, నరహరి చెరో ప్రక్క వుంటారు. కమల సోఫాలో కూలబడి నిశ్శబ్దంగా ఏడుస్తూ వుంటుంది.)

రామా: ఏమంటారు నరహరిగారూ- వెతికిస్తారా శవం కోసం!

నర : ఎందుకండీ అనవసరంగా ? నీళ్ళల్లో మునిగిపోవడం మన కళ్ళారానే గదండీ చూశాం. ఎక్కడ తేలుతుందో ఎప్పుడు తేలుతుందో పోనిస్తురూ - (కమల ఒక్కసారిగా కెవ్వుమని అరిచి సోఫాలో కూలబడి ఏడుస్తూంటుంది. నరహరి ఆమె దగ్గరకు వెళ్ళి) కమలా ! వూరుకో...వూరుకో ముందు. (కమల మాటాడదు) లోపలకుపోయి పడుకుందువుగాని లే.

(లేవదీసి లోపలికి తీసికెళ్తాడు)

సుకు : మనిషికి బాగామతి తప్పిపోయింది.

రామా: రాజారావుగారి సంగతేనా?

సుకు : ఆఁ...ఆ వుపన్యాస ధోరణి కూడా చూశారా యిందాక? మతి తప్పిన మనుష్యులకే—

రామా: తప్పింది మతికాదు—గతి! అది పిచ్చి ధోరణే అయితే అదంతా వుత్త నటనగాని నిజంకాదు. శిక్షపడకుండా తప్పించుకోడానికి! ఉండదుగా కఠినశిక్ష మతిభ్రమించి చేసిన నేరానికి!

సుకు : అసలెందుకు చేశాడంటారా పని?

రామా: అదే తెల్సుకోవాల్సిం దిప్పుడు మనం.

మోహా: ఓ మనమూ తెలుసుకోవాల్సింది!

రామా: (అతనివంక చూసి) ఒప్పుకుంటారనుకుంటాను మీరు కూడా యిక నిక్కడి కార్యభారమంతా నా చేతుల్లోకి తీసుకోడానికి!

మోహా: నే నొప్పుకోను.

సుకు : ఎందుకని?

రామా: చాలనుకుంటాను నా కిన్నాళ్ళుగా అపరాధ పరిశోధక శాస్త్రంలో వున్న పరిచయం—ఈ విషయాన్ని—

సుకు : అవును. ఆయనకంటే అనుభవజ్ఞు లెవరున్నారు?

మోహా: ఆ పనికి ప్రత్యేకం పోలీసు డిపార్టుమెంటు ఒకటివుంది. వాళ్ళేం పుస్తకాలు వ్రాయకపోయినా murder కేసులూ అవీ కొన్ని investigate చెయ్యకపోలేదు.

రామా: కాని-లేదుకదా యిక్కడ-ఈ లంకలో - పోలీసనే వాడు.

మోహా: లేకపోతే వచ్చేదాకా నిరీక్షించండి.

రామా: రావడం యెలా వాళ్ళిక్కడికి!

మోహా: తెలియజేస్తే సరి.

రామా: తెలియజెయ్యడం మరెలా యిప్పుడు!

మోహా: నాకు మటుకేం తెలుసు-ఎలా చేసినా సరే.

సుకు : అదేవిట్రా అలా మాట్లాడతావ్?

రామా: ఏం వెంకన్నా-వున్నది కదూ మరోలాంచి యిక్కడ?

వెంక : వుందికానీ యీ తుఫాన్లో అవ్వరి జేరుకోవడం శానా కష్టంబాబూ. చాలా పాతది తట్టుకోలేదీ గాలిదెబ్బకి.

సుకు : మరేం చెయ్యడమబ్బా ఇప్పుడు?

(నరహరి వస్తాడు.)

మోహా: వెళ్ళిపోయినలాంచీ తిరిగొచ్చేదాకా కాళ్ళుముడుచుక్కూచోవడమే.

రామా: రావటమెప్పుడది?

వెంక : ఎల్లుండి మధ్యాన్నంబాబూ. సరళమ్మగార్ని ఆర్నీ తీసుకొస్తుంది.

[నళిని విచారంగా యిటు చూస్తుంది.]

నర : పాపం! యిన్నేళ్ళకి భర్తని చూడ్డానికి వస్తోంది, చివరకిది!

(అంతా ఒకరిమొహాలొకరు చూసుకుంటారు...ఒక్క క్షణం అలా కాలం)

రామా: (గొంతు సవరించుకుంటూ) జరిగిన నేరానికి గల సాక్ష్యాధారాలు మాసిపోకముందే కేసు clear చెయ్యడం మనవిధి. చేసుకోలేక పోవచ్చు నాలుగు మూడు రోజులదాకా బాధ్యత గల అధికారు లిక్కడికి. వచ్చిన తర్వాత హత్యకు కారణ మేమిటో వాళ్లు నిర్ధారణ చెయ్య లేకపోయినా—రాజారావు తను ఇందాక స్వయంగా ఒప్పుకున్న విషయం కాదని బుకాయించినా అసంభవం అతనే నేరస్తుడని ఋజువు చెయ్యడం!

మోహ: అయితే మీరే అతన్ని నేరస్తుడుగా నిరూపిస్తా నంటారా?

రామా: తప్పేం?

సుకు: అవును – యేమిటి తప్పు?

మోహ: అంత అవసరం లేదంటాను. రాజారావును దోషిగా నిరూపిస్తే చచ్చిపోయిన నారాయణ తిరిగి వస్తాడా? ప్రపంచంలో హత్యలన్నీ జరక్కుండా ఆగిపో తయ్యా?...యేదో తగినంత కారణం లేందే రాజా అతన్నెందుకు చంపుతాడు?

వెంక: నేనూ అదే అనుకుంటున్నాను బాబూ

[ అందరూ వెంకన్న వేపు చూస్తారు ]

రామా: (అతనివైపు ఒక అసహ్యపు వేసి పరిశీలించి తీక్షణంగా చూస్తూ) చాలా తమాషాగా వున్నది వెంకన్నా నువ్విప్పుడన్న ముక్క! తెలుసునన్లే వుందే మాకు తెలియాల్సిన

విషయం యేదో నీకు ! . . . ఊఁ చెప్పు — (మూతిబిగబట్టి) చెప్పు యేమిటో అది. . .(బిగ్గరగా) చెప్పు—

వెంక : నాకేం తెలీదండీ.

రామా: చెప్పు నిజం. . .నిజంగా తెలీదా నీ యజమాని నారాయణ్ణి యెందుకు హత్యచేశాడో ?

వెంక : అదేనండీ—

రామా: ఏమిటది ?

వెంక : అదే బాబూ నాకూ తెలీదంటాను. కాని – యేదో కారణం వుండక పోతుందా అనే నేనూ అనుకుంటుండా బాబూ.

రామా: (విసుగూ, కోపమూ వచ్చి) తెలిసిందా యెవరైనా సరే యే విధమైన సాక్ష్యమైనా అణిచిపెడుతున్నారని పోలీసులు రాంగానే—

వెంక : (గబగబా ముందుకొచ్చి) అయ్యా – నాకో చిన్న యిసయం గాపకమొచ్చిందీ—

[ అతని వెనకాలే వచ్చిన నళిని డొక్కలో పొడుస్తుంది మోచేత్తో, వెంకన్న నోరు మూతబడిపోతుంది ]

రామా: చెప్పు – ఊఁ – యెమిటా చిన్న విషయం ?

వెంక : అరెరె ! ఇంతలోనే మర్చిపోయానండీ యెదవది !

రామా: ఇదుగో. మిస్టర్ – దాచిపెడదామనుకొంటున్నా వేమో నువ్వేమన్నా—

నళిని : Well mister! పోలీసులు రాకముందే మేం యే ప్రశ్నలకీ సమాధానం యివ్వం. అలాఅని వాళ్ళకు రిపోర్టు చేసుకోవచ్చు.

[ సుకుమార్ ఒక్కసారిగా యెగిరిపడి లేచి మెట్లమీద తలుపువంక వేలెట్టి చూపుతాడు. అది నెమ్మదిగా తెరుచుకుంటోంది. ]

సుకు : చూడండి - చూడండీ -

రామా: (భయంతో కంపిస్తూ) ఏ - ఏమిటది.?

సుకు : ( వెనక్కి తగ్గుతూ) ఇ - యివతలికి వస్తున్నాడు.

( నరహరి వెనక దాక్కుంటాడు కాని తలుపు మళ్ళీ నెమ్మదిగా మూసుకుంటుంది. )

సుకు : ఏమండీ - యేమిటి చేయడం ?

నళిని : ఎందుకంత భయం ? ఏమతను బైటికొస్తే ?

సుకు : మనల్నందర్నీ వరసగా నుంచోబెట్టి Shoot చేసి పారేస్తే ?

మోహ: (అసహ్యం వేసింది) అహ్హా-

రామా: బెదిరించాడు యిందాక నన్నుకూడా రివాల్వరుతో చంపుతానని !

మోహ: ఏం ఇంతలోకే ?

సుకు : ఏదన్నా ఉపాయం చూడండీ. అతనెలాగైనా బైటకు రాకుండా చూడండీ మీకు పుణ్యం వుంటుంది.

రామా: (ఇంకా స్వరం కంపిస్తూనే) వుందా యెవకన్నా ఆ తలుపుకి తాళంచెవి ?

వెంక : ఉందిబాబూ.

రామా: ఇచ్చెయ్ ఇలా.

వెంక : ఎలాబాబూ యివ్వటం? నే నివ్వలేను.

రామా: ఎందుకని ?

వెంక : ఎలాబాబూ – తలుపుకే పెట్టివుంది అవతలపక్క !

రామా: ఓ ! (నిస్సారంగా కుర్చీలో కూర్చుంటాడు)

నళిని : రాజాని బైటికి రానీకుండా తాళం వెయ్యాలనా ! పోనీ మీరేవెళ్ళి వేసి రారాదూ దానికే వుందిగా తాళంచెవి ?

రామా: (ఎగిరిపడిలేచి) నేనా ? – నేను ? ... (భయం కప్పిపుచ్చుకుంటూ ఇకిలిస్తూ) ఇయ్యకపోవచ్చు నా కతడు తాళంచెవి !

మోహ: (అతని పిరికితనానికి నవ్వొచ్చి) లాక్కురండీ ఇయ్యక పోతే !

రామా: అతని దగ్గరే వున్నదింకా ఆ రివాల్వరు !...పోనీ తీసుకురారాదూ మీరేవెళ్ళి – నాకంటే .పరిచయం గలవారుగా !

మోహ: నాకేం పట్టింది ?

రామా: నిర్వర్తించ వద్దుటండీ మరి మన విధి ? నిరాయుధుణ్ణి చేసి అతన్ని లాకప్‌లో వుంచడం మన డ్యూటీ అంటే వినరేం ?

మోహ: నా Duty మటుక్కాదూ,

రామా: తీసుకురా వెంకన్నా ఆ తాళంచెవి నువ్వైనా వెళ్ళి ?

వెంక : కావాలంటే మీకో దణ్ణం పెడతాగాని నావల్ల మటుకు కాదు బాబూ ఆపని !

రామా: (తడబడుతూ) వెళ్ళనంటున్నావా ?

వెంక : చిత్తం.

మోహ: (చిరునవ్వుతో) శెబాష్ వెంకన్నా !

రామా: పోనీ మీరు సుకుమార్జీ ?

సుకు : అమ్మబాబోయ్ ! – ఇంకేమన్నా వుందా ?

రామా: ఎల్లాచచ్చేది చేస్తుంటే యింతమంది సహాయనిరాకరణం ?

నర : నే వెళ్ళి తెస్తాను.

(లేచవెళ్ళి మెల్లెక్కుతుంటాడు. అంతా వూపిరిబిగబట్టి చూస్తుంటారు)

సుకు : (అతన్ని మధ్యలో ఆపి) ఒద్దు – మిమ్మల్ని బతకనీదు.

(నరహరి వదిలించుకుని మునివేళ్ళమీద నడుస్తూ పోయి తలుపుhandle నెమ్మదిగా త్రిప్పుతుంటాడు)

సుకు : జాగ్రత్త !

రామా: (ఉలిక్కిపడి) ఇష్షీ !

(నరహరి తలుపు కొద్దిగాతోసి సందులోంచి చెయ్యి పోనిచ్చి తాళంచెవి తీసుకుని దబాలున తలుపులాగి మూసి ఇంకా బలంగానే పట్టుకుని వుంటాడు)

సుకు : కానీండి. త్వరగా తాళంవేసెయ్యండీ మళ్ళీవస్తాడేమో!

(నరహరి తాళంచెవి పెట్టివిప్పి కిందికి వస్తాడు. పెద్ద అపాయంలోంచి బయటపడ్డట్టు రామానందం వూపిరిపీల్చి నరహరికి ఎదురువెళ్తాడు.)

రామా: మీకేమన్నా సాయంచేద్దామని వస్తున్నాను.

(మోహన్ పక్కన నవ్వుతాడు.)

నర : (విరసంగా) ఓ ! అలాగా ! Thanks

రామా: జాగ్రత్త చేస్తాన్నేనా తాళంచెవి ఇవ్వండిలా Mr నరహరీ !

(నరహరి ఓ క్షణం అతనివైపుచూచి తాళంచెవి యిస్తాడు)

రామా: తెచ్చెయ్యకపోయారా రివాల్వరుకూడా ఏకంగా... బాగుండేదిగా ?

నర : (అసహ్యంతో ఒకప్రక్కకిపోతూ) ఈసారి మీరువెళ్లి తీసుకురండి - తాళంచెవి మీదగ్గరే వుందిగా !

రామా: ఆఁ - ఆఁ - పోనీండి మరేం ఫర్వాలేదు - తాళం వేశాంగా గదిలోపెట్టి ! చాలది. (ఎగిరిపడి) పడిందో లేదో తాళం సరిగ్గా ?

నర : చూసిరండి !

రామా: ఎందుకూ - పడేవుంటుంది లేండి. పడేవుంటుంది. (Slight pause)

నళిని : ఆఁ వెంకన్నా ! మా యింటికి వెళ్తున్నాను నాతో అందాకా వచ్చిపో.

వెంక : వస్తా పదండమ్మా.

రామా: వెంకన్నా ! వెళికిరావాలి నువ్వోకసారి నదిఒడ్డునే. ఆరెల్లు దుబ్బులదగ్గరా అక్కడా చూడాలి చాలా

జాగ్రత్తగా. చిక్కుకొని వుండచ్చు శవం అలాంటి చోట్ల !

వెంక : (ఇష్టం లేకపోయినా తప్పనిసరై) సరేబాబూ !

రామా: కనుపించు నాకోసారి నువ్వు మళ్ళీ వచ్చాక. (వెంకన్న, సఖిని వెళ్తారు) ఏం బాగుండలేదు. నా నౌకరు వాడికెరకూ. వాడికీవిషయం గురించి మనందరి కంటే బాగా తెలుసని నా అనుమానం.

సుకు : అబ్బ - ఈ పిక్నిక్ లో ఓ హత్య ప్రోగ్రాంకూడా వుంటుందని తెలిస్తే చస్తే వచ్చేవాణ్ణి కాదు నేసనలు.

రామా: అందులోనూ కళ్ళయెదుట జరిగిందికూస్తా కూస్తా సంఘటనా ? తీసిపారెయ్యడమాయె ఓ నిండుజీవి ప్రాణాలు నీలువునానూ !

సుకు : మొగాణ్ణి నాకే ప్రాణాలింకా గూట్లోకి జేసుకోలేదు - ఆ ఆడంగులెలా నిభాయించుకో గలుగుతారా అని !

మోహ: (అసహ్యంగా) నీకేమొచ్చిందిప్పుడు ?

సుకు : ఏంరావాలింకా - చచ్చినంత పనైతే ! పిస్టలు సరిగ్గా నాకేసే గురిపెట్టాడిందాక తెలుసా ?

మోహ: పేల్చలేదుగా !

(రామానుజం చిత్తుకాగితాలబుట్టిగాలించి కొన్ని కాగితం ముక్కలూ ఒక కవరూ తీస్తాడు.)

రామా: ఇవిగో - పనికొస్తాయేమో ఇవ్వేమైనా హత్యా కారణం తెలుసుకోడానికి ?

సర : ఏమిటవ్వి ?

రామా: చించిపారేసిన వుత్తరం అనుకుంటాను ఇదిగో కవరు — దీనిమీంద వున్నది రాజారావుగారి అడ్రస్సే చించెయ్య లేదిదిమాత్రం.

మోహ: (లేస్తూ) చూస్తుంటే చాలాదూరం పోతుందిది — మీకేం సంబంద మనండీ —

రామా: ప్రయత్నిస్తున్నా నేను ఆయనచేసిన దారుణకృత్యా నికి కారణం ఏమిటో తెలుసుకోడానికి. దానికీ వుత్తరం ఒక ఆధారం కావచ్చు.

మోహ: తినిపోవయ్యా అని విందుకు పిలిస్తే నీపని నువ్వు చూచుకోక పెద్దపత్తేదారీ వెలిగించబోతా వేమిటయ్యా నా కర్థంకాక అడుగుతా ను ?

సుకు : అంహాం — అదేమిట్రా — జరిగినపనికి ఆ వుత్తరం ఒక ఆయువుపట్టు కావచ్చు. మోహన్ మాటల కేంగాని రండి రామానుజంగారూ — ఆ కాగితం ముక్కలు కలిపి అతికిద్దాం.

(కాగితం ముక్కలన్నీ తీసుకొని టేబులుమీద వేసుకూర్చుని సర్దటం మొదలెడతాడు. రామానుజం ప్రక్కనే నిలబడతాడు)

మోహ: ఛీ — ఛీ — దరిద్రం.

రామా: అర్థం కాలేదల్లేవుంది మీకింకా రాజారావు చేసిన ఘోరాపరాధం ! మాట్లాడు తున్నారే అతనింకా మనలో ఒకడన్న భావంతోనే మీరు !

మోహ: కాక ! న్యాయాధికారం అతన్ని దోషిగా ఋజువు పరచేవరకూ అతనూ మనలో ఒకడే.

సుకు : (కాగితం ముక్కలు సర్దుతూ excited గా) వస్తోం దొస్తోంది.

రామా: (ఉలిక్కిపడి) ఏమిటది ?

సుకు : ఇదేనండీ — వుత్తరం !

సర : ఇలా తేండి అట్టే అరవక.

(ఆ కాగితం ముక్కలు తనముందు వేసుకు సర్దటం ప్రారంభిస్తాడు)

రామా: (మళ్లీ మోహన్ వైపు తిరిగి) అదికాదు మోహన్ రావుగారూ—ఎవరున్నారు చెప్పండీ లంకలో ప్రస్తుతం న్యాయం చూడాల్సినవాళ్ళు మనకంటే ?

మోహ: మనలో ఒకణ్ణయినా నేను చెబుతున్నాను గా — అనవ సరపు విషయాల్లో జోక్యం కల్గించుకోవడం యేమీ పనికిరాదని.

రామా: No—No—Mr. Mohan ! ఎందుకు మీకీ మొండి పట్టుదల ? వినిపించుకోరేం మేం చెప్పేది ? అసలే చాలా నిర్మానుష్యమైన లంక యిది ! ఈ వైపుకే ఎవరూరాని ప్రదేశం ! అంతకంతకూ ఎక్కువౌతున్న తుఫాను ఇంకా ఎక్కువైతే అసలే వుండదు లాంచీ వచ్చేమార్గం. వీలుకూడా వుండదు మనకు బాహ్య ప్రపంచంతో ఏవిధమైన ఉత్తరప్రత్యుత్తరాలు జరప టానికీనూ.

(ఏదో చెప్పబోతాడు)

రామా: (చేత్తో వారించి) విచారించి, రాజారావుగారు దోషి అని నిర్ధారణ చెయ్యడం మన విధి అలాంటప్పుడు! అవునా ?

మోహా: అసలు వరసచూడగా వురితాడు విగా చేతులారానే బిగించాలని వున్నట్లుందే ?

రామా: (కోపంవచ్చి) Insult! నేనే కాదు – ఉన్నాం మనం అందరంకూడా యిప్పుడు విపరీతమైన అపాయంలో ఇరుక్కుని! ఉన్నాడు సిద్ధంగా ఆ ఖైదీ అంతంచెయ్య డానికి అవకాశం దొరికితే చాలు మనలో ఎవరినైనా సరే–

సుశు : నాకు తెలుసు, నే చెప్పటంలా ఏదో ఘోరం——

రామా : కాపాడటానికే మిమ్మల్నందర్నీ కూడా–ఏం చేసినా నే నిప్పుడు !

మో : Thanks. నన్నెవరూ కాపాడక్కర్లేదు.

సుశు : మరి నా సంగతి ?

మో : నీ కేమొచ్చిందిప్పుడు ? ఇందాకే నా కసహ్యం మిమ్మల్ని చూస్తుంటే ! నవలల్లోనూ సినిమాల్లోనూ హంతకుల్ని చూసి వాళ్ళనీ వాళ్ళ Characters లో ట్విస్టుల్నీ తెగ పొగిడి సమర్థించే మీరు మన మిత్రుడు డాకడు ఎవరినో ఎంత సమంజసమైన కారణంవుందో హత్య చెయ్యంగానే వాణ్ణి విచారించాలనీ ఉరితియ్యా లనీ పట్టుదల పడుతున్నారు ! ఛీ – నాకుమట్టుకు యిా

సరిగ్గ వ్యవహారంలో యేవిధమైన జోక్యం అక్కర్లేదు—
మీరు యేమనుకున్నా మీరు లేదనండి—నే వెళ్తున్నాను.

(లోపలికి వెళ్ళిపోబోతాడు)

సుకు : మరి నేను ?

మోహ: రావయ్యా వస్తేనూ !

సుకు : కాస్త ఆ వుత్తరం యేమిటో చదవనీరా—వినిపోదాం.

(మోహన్ కేసి కోపంవచ్చి అతనివంక అసహ్యంగా చూసి తలుపు దభాల్న మూసి వెళ్ళిపోతాడు)

రామా: (Aggrieved) I am really sorry ! అర్థం చేసుకో లేదేం ఆమాత్రం అతను మన విధి మనం నిర్వర్తించి తీరాలీ అని.

(నరహరి లేచి నుంచుంటాడు - అతికించిన వుత్తరం చూస్తూ)

నర : ఇదుగో వుత్తరం.

సుకు : ఎక్కణ్ణుంచి ?

రామా: ఏమని రాశారూ?

సుకు : ఇవ్వండిలా చదువుతాన్నేనది.

రామా: ఎవరు రాశారసలు ?

(కాగితం తీసుకుని దానివంక చూస్తూంటాడు.)

సుకు : ఏమిటది ? ఏమని ?

రామా: కొంచెం కష్టంగానే వుందిగాని చదవటం—

సుకు : చంపకండి వెధవ సస్పెన్సూ మీరూనూ ! చదవండి.

రామా : (చప్ప చప్పగా చదువుతూ) 'ప్రియా !'—

(ఆగి కాగితంలోకి చూస్తూంటాడు)

సుకు : ప్రియా ? ఊఁ—ప్రియా ?

రామా : "ఎప్పుడు రెక్కలు కట్టుకువచ్చి మీదగ్గర వాలు దామా అని ఎంత......" తెలియటం లేదేమిటో...

(నరహరి రామానుజం భుజంమీద నుంచి వుత్తరంలోకి చూచి 'ఎంత ఉత్సాహాలూగిస్తున్నా—' అని అందిస్తాడు)

రామా : ఆఁ..."ఎంత ఉత్సాహాలూగుతున్నా వారోజు ఆలస్యం అయితీరాల్సి వచ్చింది. దీనికి కారణం మా అమ్మ వంట్లో కాస్త నలతగా ఉండటమే అయినా ఈ ఆలస్యానికి నాకు మట్టుకు ఏమో దుఃఖంగానే వుంది. ఆలస్యానికి అపార్థం చేసుకోవద్దు—మీరు కూడా నన్ను అనుమానిస్తే ఎలా ? మీరే నా ప్రాణం. మీరే నా సర్వస్వం. మన ఆనందానికి మన సౌఖ్యానికి ఒకే ఒక మార్గం వుంది...

(చదవటం మాని అందరి వంకా చూస్తాడు—'చూశారా ?' అన్నట్టు. వాళ్ళు 'కానీ'మని సైగ చేస్తారు.........)

"మీరైనా హృదయపూర్వకంగా ప్రేమించకపోతే నాకు ఆత్మహత్యే శరణ్యం. పిచ్చిపిల్లని ఇదంతా రాస్తున్నానేమిటి—నాకు తెలియదూ మీరు నన్నెంతగా ప్రేమిస్తున్నారో ? మిగతా సంగతులన్నీ—" వినండి— వినండి, అసలు కీలకం ఇక్కడే ఉంది !

సుకు : సరేలే చదవండీ.

రామా : "మిగతా సంగతులన్నీ తమిదీరని తమ కౌగలిలో!"

సుకు : ఆఁ—ఇంకేం రాశారు ?

రామా : (ఉత్తరం బల్లమీద పెట్టి జేబుగుడ్డతో నొసలు తుడుచుకుంటూ) అంతే—ఇంకేం లేదు.

సుకు : (దస్త్రాను వస్తూ) ఎక్కణ్ణుంచి వచ్చిందసలిది? సంతకం ఎవరిది? (తీసుకుని చూసి) 'సరళ!' సరళా? నారాయణ పెళ్ళాం? ఓరి దేముడా! రాజారావుకి సరళ ప్రేమ లేఖా!

[ నరహరి యిదంగా వెళతాడు ]

రామూ : ఇదీ సంగతి. జరిగిన పనికి కారణం ఇది! అర్థం కాలా?

సుకు : ఇందుకనన్న మాట రాజారావీ హత్య చేసింది! నారాయణ తన ప్రేమ కలాపానికి ఏ విధంగానూ అడ్డు రాకుండా వుండాలనన్న మాట...! కాని రాజారావలాంటివాడే అయితే నారాయణ్ణీ సరళనీ కలపాలని ఇంత ప్రయత్నం యెందుకు చేస్తాడా అని!

రామూ: అసలు రహస్యం బయటపడకుండా తనేదో పెద్ద ఆప్తుడని అందరూ అనుకోడానికే అయివుండాలి!... ఇదుగో కవరు! చింపెయ్యలేదు దీన్ని మాత్రం! యిలానే వుంటాయి హంతకులు చేసే పొరబాట్లు! (చూచి అడ్రస్ చదువుతూ) 'మహారాజశ్రీ శ్రీ రాజారావుగార్కి!' (బాల్కనీ వేపు తిరిగి వెటకారంగా) హుఁ — మహారాజశ్రీ శ్రీ రాజారావుగారూ! చాలా పొరబడ్డారు మీరీకవరు చింపకుండా పారెయ్యడంలో! ఇదే చేసిన పాపానికి తమరు చేతులారా వ్రాసిచ్చిన వాఙ్మూలం!...ఆఁ—జాగ్రత్త చేస్తాన్నేనివన్నీ. యివ్వాండిలా ఆ వుత్తరంకూడా.

(తీసుకుని జేబులో పెట్టుకుంటాడు.)

నర : సరళకన్యాకూడా యిది నమ్మేపాపం. దీన్నిబట్టి ఆమే యీ హత్యను ప్రోత్సహించిన దనవచ్చు.

రామా: కాని ఒకటున్నది నా కర్థంకాని విషయం – ఎందు కొప్పుకున్నాడసలు రాజారావు ఏపని చేసింది తానేనని ? గుప్‌చిప్‌గా ఊరుకుంటాడెంత బుర్రలేనివాడైనా శవా న్నేయేట్లోనో బావిలోనో తోసేసా రేసి!

సుశ : అసలు నే మేలుకునే వున్నానా – లేకపోతే యిదంతా ఓ భయంకరమైనకలా ?

(Dr R లోంచి ఉన్నట్టుండి రేడియోపాట చాలా హెచ్చుగా కఠోరంగా వినిపిస్తుంది. అంతా రాతివిగ్రహాల్లా అయిపోతారు)

సుశ : (గొంతు పెకలించుకొని) పాట – రేడియో !

నర : ఎవరుపెట్టారో !

రామా: చూసిరం డసలదేమిటో ముందు (తనుమాత్రం కదలడు).

[ నరహరి గబగబా వెళ్ళి తలుపులు దభాల్న తోస్తాడు. డ్రాయింగు రూమ్‌లో (Dr R) అంతా చీకటి. రేడియో పాడుతూనే వుంటుంది. అగ్గిపుల్లగీచి లోపలికి పోతాడు నరహరి. లోపల Switch on చేసి లైటు వెలిగిస్తాడు. పాటమధ్యలో ఆగుతుంది. లైటుఆర్పి నరహరి బైటకువచ్చి తలుపులు వేస్తాడు. ]

రామా: }<br>సుశ : } ఏ – ఏమిటది ?

నర : (కాస్త విసుగుతో) రేడియో.

రామా: ఎవరున్నారు లోపల ?

నర : ఎవరూ లేరు.

సుకు : మరి — మరెవరు పెట్టారు చెప్మా ?

నర : ఏమో ? నాకుమటుకేం తెలుసు ?

సుకు : ఐపోయింది — ఇహ నాకు కళ్ళు తిరుగుతున్నాయి !

రామా: (కాస్త తేరుకుని) ఆఁ అఁ — అయివుంటాం లేనివాళ్ళో బెదరగొట్టటానికి నీలాంటి పిరికిపందల్ని !

సుకు : కాదు — అది పెట్టింది రాజారావు !...అవును — నాకు తెలుసు ! అలాఅని నా అంతర్వాణి ఘోషిస్తోంది.

రామా: ఆఁ అఁ — అసంభవం వేసినట్టేవుంది వేసినతాళం — భద్రంచేసిన తాళంచెవి జేబులో భద్రంగానే..(జేబులో చెయ్యిపెట్టి చూసుకుంటాడు. తాళంచెవి దొరక్క — మొహం అంతా చెమటలుకమ్మి కంగారుగా జేబంతా గాలిస్తాడు. చివరకు దొరుకుతుంది. 'అమ్మయ్య!' అని నిట్టూర్చి—) ఇదుగో — ఇక్కడే వుంది భద్రంగా ! పోయి నే విడిపిస్తేగాని బయటికి రాలేడతను !

సుకు : అవునూ—ఆ గదిలోంచి ఈ గదిలోకి స్తంభాల్లోంచీ, గోడల్లోంచీ రహస్య మార్గాలేమన్నా ఉన్నాయేమో!

రామా : అవునంటోయ్—ఉంటే వుండొచ్చు మీట తలుపులూ, మర సొరంగాలూ కూడా !

సుకు : ఆలోచించాల్సిన విషయమే అది కూడా !

నర : సరే మనమిక చెయ్యగల్గిందేమీ లేదు. పోయి పడుకుంటే మంచిది.

సుకు : పడుకా ! ఛస్తే కంటిమీద కునుకురాదు నాకు.

రామా : ఆ మిగతా ఉత్తరాల సంగతేమిటి, నరహరిగారూ ?

[ రామానుజం బల్లదగ్గరకొచ్చి వాటివంక చూస్తూ నుంచుంటాడు ]

నర : అవేవీ చించిలేవు గదూ ?

రామా : లేవు.

నర : అయితే అవి మనం తెరవడం మంచిది కాదనుకుంటాను. అధమం అవయినా పోలీసులకు వదిలి వెయ్యడం మంచిది.

రామా : (ఇష్టం లేకపోయినా) అవుననుకుంటాను. అదే మంచిది. పెడ్తానివన్నీ డ్రాయర్లో. (పెట్టి) మంచిదనుకుంటాను తాళం కూడా వేస్తే. (వేసి) ఉంచుతానిది కూడా నా జాగ్రత్తలో (తాళంచెవి జేబులో వేసుకుని) నే వెళ్తా నిహ.

[ Dr R తలుపు తెరుస్తాడు. ]

సుకు : (ఏదో తట్టి వెఱ్ఱికేక వేసి) అమ్మబాబోయ్ !

రామా : (ఉలిక్కిపడి వెనక్కి తిరిగి) ఆపవయ్యా నీ వెఱ్ఱి కేకలు...ఏం ? – ఏంవొచ్చింది మళ్లీ ?

సుకు : అది – ఆ రేడియో – అది పెట్టింది నారాయణి ! రాజారావు కాదు ... అవును ! చచ్చి దయ్యమై వచ్చిన నారాయణి ! అలాఅని నా అంతర్వాణి ఘోషి...

[ సోఫాలో కూలబడతాడు రామానుజం పెదవులు తడుపుకుంటూ Dr R వైపు చూస్తాడు. ]

నర : మతిలేకుండా మాట్లాడకండి.

రామా : (ఓ క్షణం తటపటాయించి Dr R తలుపులు మూసి) పోనీ ఆ గదిలోంచే పోతాను యెందుకైనా మంచిది. (D R కేసి వెళ్తాడు.)

సుకు : ఇదిగో రామానుజంగారూ! నన్నుకూడా రానియ్యండి మీకెక్కువ పుణ్యముంటుంది (అతనిచెయ్యి పట్టుకు పోతూ) హమ్మయ్య - మీరు పక్కనవుంటే కొంతంత ధైర్యంనాకు !

[ రామానుజం వెనక్కివచ్చి ఆయుధంగా పనికొచ్చే వస్తువేదో ఒకటి తీసుకుని వెళ్తాడు, సుకుమార్‌తో సహా. గదిలో నరహరి ఒక్కడే మిగులుతాడు. తుఫాను కాస్త శాంతించినట్లుంది గాని గాలియింకా విసురుగానే వుంది. రాజా గదికేసి చూస్తాడు. ఓసారి Dr R వాకిలిదాకా పోయి తలుపు తెరవబోయి మళ్ళీ మనస్సు మార్చుకుని లైటు-Switch off చేసి D. R. లోంచి వెళ్ళిపోతాడు.

గది యిప్పుడు పూర్తిగా చీకటిగా వుంది. ఒక్క క్షణం అవకాశంతో Dr. R తలుపులు తెరుచుకుని అసహజమైన కాంతిలో తేలియాడుతూ ఒక ముఖం వస్తుంది. ఆ ముఖం సిగరెట్టు ముట్టించి సోఫాలో కూర్చోబోతూండగా బైట వరండాలో కాస్త చప్పుడవుతుంది ఎవరో వస్తున్నట్టు. చేతిలో సిగరెట్టు ఆర్పి పారేసి ఆముఖం గబగబా మళ్ళీ Dr. R.లోకి వెళ్ళిపోతుంది. వరండా తలుపు తెరుచుకుని నళిని వచ్చి లైటు వేస్తుంది. చేతిలో తాళం చెవులగుత్తి వుంటుంది. గబగబా మెట్లెక్కి వెళ్ళి రాజా గదితలుపు తట్టుతుంది......... ]

రాజా: (లోపల్నుంచి) ఎవరది ?

నళిని : నేను.

రాజా: తలుపుకు తాళంవేశారు నళినీ !

నళిని : మరేం ఫరవాలేదు-నా దగ్గర మరో తాళంచెవి వుంది. (తాళం తీస్తుంది.)

రాజా: (బైటకివచ్చి) Thanks నళినీ ! ఖర్మంచాలక నువ్వెప్పుడైనా జైల్లోపడితే నీ ఉపకారం మరిచిపోన్లే.

[ మెట్లుదిగి వస్తాడు. నళిని అతనివైపే పరిశీలనగా చూస్తుంది. ]

నళిని : ఏంపని చేశావ్ రాజా !

రాజా: Nonsense. నారాయణగాడు కాస్త అడపా తడపా చస్తూంటేగాని బాగుపడడులే.

నళిని : రాజా !

రాజా: (నళిని భయానికి నవ్వుతూ) అవున్నళినీ !

[ నళిని నిందాపూర్వకంగా చూస్తుంది అతనివంక. ]

ఏం...అంత చెయ్యరాని పని అంటావా ? (మళ్లీ నవ్వుతాడు) సరే నిన్నుకూడా బాధపెట్టటం యెందుకులే. అసలు సంగతి చెప్తున్నా విను—అదంతా తమాషా !

నళిని : తమాషా ?

రాజా: అవును వొట్టి తమాషా ! అంతా నాటకం! ఆమాత్రం గ్రహించలేక పోయావా ? అసలు పిస్టలెలా పట్టుకోవాలో కూడా యెరగనని తెలీదూనీకు ! చాలాసార్లు 'ఎందుకాపిస్టలు – ఎవళ్ళకేనా ఇచ్చేస్తా'నంటే 'నాన్నగారిది – అట్టే పెట్టు' అన్నావు కూడానూ.

నళిని : నాటకం...ఓహ్ !

(నిట్టూర్చి అంతలోనే పకపకా నవ్వుతూ సోఫాలో కూలబడుతుంది. అకస్మాత్తుగా నవ్వుఆపి మోహంతిప్పేసుకుని కళ్లు ఒత్తుకుంటుంది.)

రాజా: ఏమిటి ? – ఏమిటి నళినీ ?

నళిని : నిన్ను చూస్తూంటే నాకు తగని అవమానంగావుంది.

రాజా: అబ్బో ! ఎందుకో ?

నళిని: ఇంత దారుణమా? ఇంటికి పిలిచి వాళ్ళనింత గగ్గోలెత్తించడానికి నీకు మనస్సెలా వొప్పింది? వాళ్లంతా హడలిపోయి గుండెలుపగిలి చస్తున్నారు. పోలీసులకు కబురు చెయ్యాలనీ, నిన్ను విచారించి వురిదియ్యాలనీ ఆలోచిస్తున్నారు తెలుసా?

రాజా: నిజం? అంత హడలిపోయారా? ఐనా మరేం ఫరవా లేదులెద్దూ. వచ్చిన దగ్గర్నుంచీ ఒకటేగోల హత్యలనీ హంతకులనీ. నేనూ కాస్త రుచి చూపిద్దామనుకున్నాను...కాని...ఆ రామానుజం వున్నాడే వాడు మరీనూ! తనురాసిన పుస్తకాల్లో సంగతులన్నీ ప్రాణం పోసుకు వచ్చినయ్యనుకున్నాడు పాపం! (సిగరెట్ ముట్టించి) ఏం నళినీ! వాడిపుస్తకాలు బాగున్నాయా, నా స్టంట్ బాగుందా?

నళిని: మరి నదిలో కొట్టుకుపోయిన శవం? రామానుజమూ, నరహరీ కూడా కళ్ళారా చూశామన్నారు?

రాజా: అదా! నాలుగు దిళ్ళూ, ఓ చొక్కా లాగూనూ! మిగతా పనంతా వాళ్ళ వూహే చేసిందీ! ఐడియా కదూ?

నళిని: ఘోరం! (వరండాకేసి వెళ్తూంటుంది.)

రాజా: (సిగరెట్ ఆర్పి) నళినీ! నళినీ! Please_ వెళ్ళకు. (నళిని ఆగి వెనక్కితిరిగి అతనివంక చూస్తుంది. అకస్మాత్తుగా ఆవహించిన యేదో ఆవేశంవల్ల ఒక్కక్షణం మాట్లాడ లేకపోతాడు రాజారావు. కాస్త ముందుకు వచ్చి-) నళినీ! నే నింతవరకూ అవగాహన చేసుకో

లేదు నళినీ — ఇన్నాళ్ళయినా కూడా! (నళిని అతని దగ్గరకు వస్తుంది. ఇద్దరూ నోట మాటలేకుండా ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూస్తూంటారు. అనుకోకుండానే మరింత దగ్గరకు జేసుకుంటారు. రాజా ఆమె చేతులు పట్టుకుని—) నళినీ! నిజంగా నామీద కోపంవచ్చిందా? నే చేసినపనికి నిజంగా అంత బాధపడుతున్నావా!

నళిని: (ఒక్కక్షణంఆగి) నువ్వా — నిన్ను — నిన్ను చూసుకుని ఎంతో గర్విద్దామని నాకోరిక. (చేతులు విడిపించుకుంటూ) వస్తాను.

(రాజా ఏదో కొత్తఆనందంతో ప్రజ్వలిస్తున్న కళ్ళతో ఆమె వంక చూస్తాడు. నళిని త్వరత్వరగా వరండాలోకి వెళ్ళిపోతుంది...నారాయణ నెమ్మదిగా Dr R లోంచి వస్తాడు.)

నారా: హంతకుడా!

రాజా: (వెనక్కి తిరిగి చిరునవ్వుతో) Hallo నారాయణా! చచ్చి దయ్యమై మమ్మల్ని పీక్కుతింటానికి వచ్చావా?

నారా: మొత్తం మీద నాటకం భలేగా నడిపిస్తున్నావ్! వాళ్ళ యేడుపులూ పెడబొబ్బలూ అంతా వింటూనే వున్నాలే!

రాజా: వాళ్ళ ప్రాణాలు కూడా ఎక్కడ తీస్తానో అని నన్నో గదిలో పెట్టి తాళంకూడా వేస్తే!

నారా: మరి ఇవతలి కెలా వచ్చావ్?

రాజా: ఘూ నళిని వచ్చి తాళం తీసింది.

నారా: నళిని—ఇప్పుడు వచ్చిపోయింది నళినన్న మాట !
చాలా మంచిపిల్ల ! అలా వుండాల్రా—అలాంటి పిల్ల
లంటే నాకు బలే—

రాజా: చాల్లే నోర్మూయ్‌రా – నీ అభిరుచుల సంగతి ఇక్క
డెవళ్ళూ అడగటం లేదులే.

నారా: (అర్థం అయి) ఓ—అదా సంగతి !...ఆఁ హాఁ !—ఇదన్న
మాట వ్యవహారం !

రాజా: ఆట్టే వాగావంటే మళ్ళీ shoot చేసేస్తాను జాగ్రత్త!

నారా: ( Shrug చేసి, సిగరెట్ ముట్టించి) Oh, Sorry.

రాజా: ఆఁ—వాళ్ళందర్నీ పిలిచి అసలు సంగతి చెప్పేద్దాం ఇహ.

నారా: No No—అప్పుడే ? అదేం కుదరదు—దయ్యమై వాళ్ళ
కంటబడటం, వాళ్ళు హడలి చావడం—రిహార్సల్సు
కూడా వేసుకున్నాను. ఇదుగో—

రాజా: ఒకేయ్ ! ఇదోటికూడానా వాళ్ళ. ప్రాణాలకి ? అసలే
పిరికి వెధవల్లా !

నారా :Nonsense! భలే ఆనందించి వుంటారు వాళ్ళు ! నిజ
మైన హత్య—సిసలైన షూటింగ్—తమకళ్ళ యెదుట జరి
గిన హత్య—ఇలాంటి excitement లక్ష నావెల్సు చది
వితే వస్తుందా వాళ్ళకి జన్మలో ?

రాజా: కాని వాళ్లు మటుకు నిజంగా చాలా హడావుడి పడ్డారు
పాపం ! గోల గోల !

నారా: ఇవతలకు వచ్చి చూద్దామని నాకు మహా అనిపించింది
గాని—తీరా వస్తే యెక్కడ చూస్తారోనని అక్కడే

గంపలో కూచ్చుండిపోయాను. అప్పటికీ ఎలానో సందు చేసుకొచ్చి రేడియో పెట్టాను.

రాజా: ఆ పాటా గీటా విని నేనూ ఆశ్చర్యపోయాను. అంతా యిక్కడ జేరి పెద్ద మీటింగు పెట్టారట. నన్ను వురి కంబం ఎక్కించి గాని నిద్రపోయేట్టు లేరట.

నారా: ఆఁ హాఁ ?

రాజా: ఆఁ! అది సరేగాని—ఈ హంతకులంటేనూ ఈ ఎక్సైట్ మెంటూ అదీ ఇప్పు డర్థమౌతోందిరా. జీవితంలో యెన్నడూ కూడా యింతగొప్పగా feel అవలేదు నేను...అసలు నిన్ను నిజంగానే చంపేస్తే బాగుండే దేమో ?

నారా: అవునవును, యిక్కడేం జరిగినా జరగొచ్చు.

రాజా: (ఉలిక్కిపడి శంకించి) అదేవిఁటి—ఎందుకలా అన్నావ్ ?

నారా: ఏం ? నువ్వే అన్నావుగా ఓసారి !

రాజా: (Relax అయి) అవునవును. నీతో చెప్పానుకదూ మా నాన్నగారు కూడా ఆ మాటే అంటూండేవారని!

నారా: సరేగాని – నా అకాల మరణానికి ఎవరన్నా దుఃఖించార్రా ?

రాజా: ఆహా ! అందుకు మటుకు నేను చాలా బాధపడ్డాను.

నారా: ఎవరు ?

రాజా: కమల.

నారా: కమల ఒక్క-తేనా ? వంటలక్కకూడా కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తుం దనుకున్నాను.

రాజా: ఇందులో నే జోక్యం కల్గించుకోరాదనుకో. అయినా నా సలహా కూడా శాస్త్ర పాటించు, ఇకముందైనా నువ్వు శాస్త్ర జాగ్రత్తగా మసులుకోవడం మంచిది.

నారా: జాగ్రత్తగా వుండటం యెప్పుడూ వంటికి మంచిదే ననుకో - కాని నువ్విలా ప్రత్యేకంగా చెప్పడంలో నీ వుద్దేశ్యం?

రాజా: నరహరి మనస్సు నిప్పురుగప్పిన నిప్పు.

నారా: అయితే? నాకేం సంబంధం?

రాజా: ఏం వుండరాదనేనోయ్ నేననేదీనూ...! ఆఁ__(జేబులోంచి రివాల్వరు తీసి) ఇహ నిది దాచేస్తాను దీని అవసరం అయిపోయిందిగా. (డ్రాయరు లాగి, రాకపోవడం వల్ల) అరె! దీనికి తాళంవేసి వుందే! (రివాల్వరు డ్రాయరుమీద వుంచి, తాళంచెవి కోసం అటూ యిటూ చూసి) తాళంచెవి కూడా కనిపించదు - చిత్రంగానే వుంది!

నారా: (ఎగిరిపడి లేచి) ఇష్__

రాజా: ఏమిటది?

నారా: (రహస్యం) ఎవరో భోజనాల గదిలో కొచ్చినట్లున్నారు. (మునివేళ్ళ మీద ఆ గది వాకిలి దగ్గరకు వెళ్లి గడియ వేసివస్తూ) వరండా తలుపు కూడా వేసిరా.

రాజా: ఎందుకు?

నారా: ఎవరన్నా లోపలికొచ్చి చూస్తే?

రాజా: చూస్తే యేం?

నారా: ఇప్పు డప్పుడే వాళ్ళకు తెలీరాకూడా నే బ్రతికున్న సంగతి—ఏం ?

రాజా: (నిట్టూర్చి, గడియవేసి వచ్చి) చూస్తూ నారాయణా—వాళ్ళందర్నీ పిలిచి అసలు సంగతి చెప్పేస్తాం.

నారా: చెప్పేసి ఇంతా కష్టపడి ఇంతసరకూ లాక్కొచ్చిన నాటకం అంతా నాశనం చేద్దామనుంటావా ? అదేం కుదరదు·గానీ—నీ కెందుకు నువ్వు నిశ్చింతగా నిద్రపో. తెల్లారి కాఫీల దగ్గర కాస్త గాబరా పడతాను—అంతే.

రాజా: ఎందుకులే నారాయణా——

నారా: (మధ్యలో నే) ప్చ్ !

రాజా: (అయిష్టంగానే మొట్ల కేసి పోతూ) సరే నీ యిష్టం... నువ్వుకూడా పోయి పడుకోరాదూ యిహ ?

నారా: పడుకుంటాలే. నిద్దరావడం లేదు. రామానుజంగాడి పుస్తకం ఏదైనా చేత బడితే నిద్రొస్తుందేమో చూడాలి.

[ టేబులు మీద పుస్తకాలు చూస్తుంటాడు. ]

రాజా: (బాల్కనీ మీదనుంచి) ఇప్పటికయినా వాళ్ళని పిల్చి చెప్పెయ్యడం మంచిదనుకుంటాను.

నారా: నువ్వు నోరుమూసుకు పోయి పడుకోరా.

[ తీసుకున్న పుస్తకం మళ్లీ టేబుల్ మీద పడేసి మరో magazine తీసి చూస్తూంటాడు. రాజారావు తన గదిలోకి వెళ్ళి తలుపేసు కుంటాడు. నారాయణ వచ్చి సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగిస్తాడు. D.R.తలుపు తెరవడానికి ఏదో ప్రయత్నం జరుగుతున్నట్లు చప్పుడు వినిపిస్తుంది. ఒక్క—క్షణం ఆగి తలుపు తట్టిన శబ్దం.

నారాయణ తీసి సిగరెట్ ఆర్పి, జేబులో టార్చి తీస్తాడు గదిలో లైటు ఆర్పి, వెలిగించిన టార్చి గడ్డంకింద పెట్టుకుని గడియ తీసి కాస్త వెనక్కి వచ్చి నిలబడతాడు. ఇందాక అసహజమైన కాంతిలో తేలియాడుతూ వచ్చిన ముఖం ఇదే! తలుపు నెమ్మదిగా తెరచుకుని, గుమ్మంలో ఓ మనిషి స్వరూపం కనిపిస్తుంది. ఆ మనిషి నారాయణ ఆకారంవంక కాస్సేపు చూసి తర్వాత మాట్లాడతాడు. కంఠస్వరాన్ని బట్టి నరహరి!]

నరహరి: హలో నారాయణా!

[నారాయణ ముఖకవళిక మారిపోతుంది. తన ట్రిక్కు పని చెయ్యనందుకు కాస్త చిన్నబోతాడు. Torch ఆర్పుతాడు. నరహరి గదిలో లైటు వేస్తాడు......]

నర: (D R తలుపు వేసి ముందుకొస్తూ సాలోచనగా సన్నగా నవ్వుతాడు) నాకు దయ్యాలంటే యెప్పుడూ నమ్మకం లేదు.

నారా: (కుంటిగా) అలాగా!

నర – అసలు రేడియో దగ్గరే నాకు అనుమానం వేసింది. అక్కడమటుకు కాస్త అతిగానే వ్యవహరించావ్.

నారా: అయితే అప్పటిదాకా___

నర: ఆహా! అప్పటిదాకా మిగతా వాళ్ళతోబాటు నేనూ ఒక ఫూల్ అయ్యానని ఒప్పుకుంటాను. (నిశ్శబ్దంగా నవ్వుతూ) మొత్తంమీద భలే ట్రిక్కు!...అసలెందుకు చేశారలా?

నారా: ఏముందీ కాస్త వినోదంకోసం!...మీ కందరికీ కాస్త హడలు పుట్టిద్దామనీనూ!

[ నగహరి మెత్తగా నవ్వుతాడు. నారాయణ
కూడా యికిలించి సోఫాలో కూర్చుంటాడు]

నర : హాడల్తైతే బాగానే వుట్టిందిగాని, దానికి కారణం పూర్తిగా మా పిరికితనం కాదు. రాజారావు కూడా చాలబాగా నిర్వహించాడు తనపాత్ర. అతనేడీ ?

నారా: వాడిగదిలోనే వున్నాడు.

నర : (అటువెళుతూ) అయితే యిక తాళంతీసి యివతలకు రానియ్యొచ్చన్నమాట.

నారా: ఈ పాటికి నిద్రపోయుంటాడులే. అయినా తలుపు తాళంవేసిలేదు.

నర : (గబుక్కున అతనివైపు తిరిగి) తలుపెవరు తీశారు – తాళంచెవి రామానుజం దగ్గర వుండాలిగా.

నారా: నళినివచ్చి తీసింది – మరో తాళంచెవి వున్నట్లుంది.

నర : (చిరునవ్వుతో కుర్చీలో కూర్చుంటో) ఓ – అలాగా ! ఆ అమ్మాయి భలే తెలివిగలపిల్ల...ఏమన్నది నిన్ను చూసి ?

నారా: (గొప్పగా) నే కనిపించలేదుగా ఆ అమ్మాయికి !

నర : అంటే – (ఆలోచనా పూర్వకంగా) నీ హత్య ఉత్త నాటకం మాత్రమేనని తెలిసింది నా కొక్కడికేనా ?

నారా: ఇంతవరకూ నీ కొక్కడికే. తెల్లారి కాఫీలదగ్గర అందరికీ చెప్పేద్దామను కుంటున్నాం.

నర : భలే ! అయితే – చచ్చిపోయిన నువ్వు అకస్మాత్తుగా బ్రతికొచ్చి అందరినీ హడలగొడతా వన్నమాట.

నారా: అసలు సంగతి తెలిస్తే మీరంతా పట్టుకు తిడతారని రాజారావన్నాడు గాని, పాపం నువ్వు ప్రమాదం కొప్పడటం లేదు. చాలా sportive గా తీసుకొంటు న్నావ్ !

నర : (గంభీరంగా) దానికి లక్ష కారణా లుండొచ్చు.

నారా: (కాస్త గాభరాగా) అంటే ?

నర : మొదటిది మమ్మల్నందర్నీ వెధవల్ని చేసిన మీ అసాధారణమైన తెలివి తేటలు ! నదిలో కొట్టుకుపోతున్న శవం——(టేబులుమీద రివాల్వరు అతనికళ్ళ బడుతుంది. అతని ముఖకవళిక మారిపోతుంది. ఒక్క క్షణం నిశ్శబ్దం ... తిరిగి నారాయణ ముఖంలోకి చూస్తూ—) అది వృత్తే డమ్మీ అనుకుంటాను !

నారా: (తేరుకుని నవ్వుతూ) అవును. హడావుడిగా ఓలాగూ చొక్కా తెచ్చి నాలుగుదిళ్ళు ఇరికించి నదిలోకి తోసేశాం !

నర : బలే ! నేనూ రామానుజం అదినిజంగా నీ శవమే నను కున్నాం. (కాస్తఆగి తనలోతాను చిరునవ్వు నవ్వు కుంటూ—) నిజానికి రామానుజం ఇంకా ఆ నమ్మకం లోనే వున్నాడు. ఎందుకూ — కోర్టులో బోనెక్కి— నీ శవాన్నే చూశానని ప్రమాణం చెయ్యమన్నా చేస్తాడు...(తల ఆడిస్తూ తన ఆలోచనకు తనకే నవ్వు వస్తున్నట్టు) దానికితోడు రాజారావు తానే నిన్ను హత్యచేశానని అందరి ఎదుటా ఇచ్చిన

వాజ్మ్యాలం ! మా మటుకు మేం నమ్మేశాం...కోర్టులో జడ్జికూడా నమ్మితీరేవాడను కుంటాను...ఏమంటావ్?

నారా: (భయపడ్డాను మనిషి) అదంతా ఓ బుద్ధిలేనిపని అని ఇప్పుడర్థం అవుతోంది.

వర : (సిగరెట్ పీలుస్తూ) అహాం - అలా అనకు మరి. నిజంగా తెలివిగలపని ! చాలా తెలివితేటల్తో పన్నిన పన్నాగం ! Most perfect గా వుంది. (సిగరెట్ పారేసి రివాల్వరు తీసుకుంటాడు.) అరె - ఇదికూడా యిక్కడే వుందే ! దీంతో నేగదూ రాజారావు నిన్ను హత్యచేశాడని మేమంతా అనుకున్నది ?...ఇందులో తోటాలైనా నిజమైనవేనా?...ఇది రాజారావు స్వంత రివాల్వరుకదూ ! (నారాయణ సోఫాలో నిటారుగా కూర్చుంటాడు.) అవును...కదూ ? ఏ జడ్జీ అయినా రాజారావు నిన్ను తన స్వంత రివాల్వరుతోనే shoot చేసి చంపాడని నమ్మితీర్తాడు కదూ ?...(రివాల్వరు వంక యేదో ఆలోచనగా చూస్తూ-) నిజంగా నీకివ్వాళ ఏదైనా ప్రమాదం సంభవిస్తుందనుకో-(నారాయణ సోఫాలోంచి లేవబోతాడు-) వొద్దు-కూర్చో - (రివాల్వరు అతనివైపు త్రిప్పి నిర్లక్ష్యంగా అతన్నే గురి చేసి వుంచుతాడు. నారాయణ లేచేప్రయత్నం విరమించుకుని సోఫాలోనే కూలబడతాడు.) నే చెప్పబోయే దాంట్లో నువ్వర్థంచేసుకోవాల్సింది చాలా వుంది !...ఈ తమాషా సంగతి మనమిత్రులందరికీ తెలీకముందే...ఈ రాత్రే...నీకేదైనా ప్రమాదం

సంభవిస్తుందనుకో ... అప్పుడు రాజారావు పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుంటుంది కదూ...

నారా: (నవ్వ లేక తెచ్చిపెట్టుకున్న నవ్వుతో) మేం మిమ్మల్ని హడలగొట్టి నందుకు నన్నుకూడా భలే భయపెడు తున్నావే !

నర : (చాలా మృదువుగా) అబ్బే ! నే చెప్పే దేమిటంటే... చిన్న తమాషా యెంత ఘోరమైన పరిస్థితులకైనా దారితీస్తుందీ అని !...ఎందాకో యెందుకూ, ఇప్పుడు చూడు మరి—అన్నెం పున్నెం యెరగని రాజారావు, తాను కలలోనైనా చేసియెఱుగని నేరానికి...ఉరిశిక్ష అనుభవించాల్సి రావచ్చు...చూడు పాపం...

నారా: (లేచి మామూలుగా మాట్లాడటానికి విశ్వప్రయత్నం చేస్తూ) వాళ్ళందరితోకూడా ఇప్పుడే చెప్పేస్తాను — మేం చేసిందంతా వుత్తనాటకం అని—

నర : వద్దు—అప్పుడే వద్దు—ఇంకా వ్యవహారం పూర్తికాందే !

[ ఒకరి ముఖాల్లోకి ఒకరు చూచుకొంటారు.
ఇద్దరిమధ్యా రెండు గజాలు ఎడం...... ]

నారా: ఇదుగో దయచేసి అది నావైపు పెట్టకు — తీసేద్దూ నీకు పుణ్య ముంటుంది. (నరహరి కళ్ళల్లో మృత్యువును చూస్తాడు. ఓ అడుగు ముందుకువేస్తూ) వొద్దు—వొద్దు ఆగు నరహరీ — వొట్టు — దేవుడిమీద ప్రమాణంచేసి చెప్తాను — కమలకీ నాకూ యే విధమైన —

[ రివాల్వరు పేలుతుంది. నారాయణ విరుచుకుని సోఫాలో పడిపోయి క్రిందికి దొర్లుతాడు. నరహరి అతనివంకే చూస్తూ చేతిగుడ్డతో రివాల్వరు శుభ్రంగా తుడిచి బల్లమీద పెట్టి వరండా తలుపు, Dr. R. తలుపు గడియలు వేసివున్నాయో లేవో చూసి, Dr. R. గడియవేసి, switch off చేస్తాడు. గది అంతా చిమ్మచీకటి. ఒక్క క్షణం తర్వాత అతను తెరచిన D R. తలుపుల మధ్యనుంచి వెలుతురు చార ఒకటి ప్రసరిస్తుంది. నరహరి ఆ ద్వారంలోంచి వెళ్ళిపోయి తలుపు వెయ్యగానే మళ్ళీ గది అంతా చిమ్మచీకటి.

వెంటనే రాజారావు తన గదితలుపులు తెరుచుకుని బాల్కనీమీదికి వస్తాడు. ]

రాజా: నారాయణా – నారాయణా—

[ అని మెట్లుదిగుతూండగా దూరాన్నుంచి
ఉరుములు గర్జిస్తూ వినిపిస్తాయి..... ]

[ తెర ]

—....—

# మూడో అంకం

రంగం : అదే.

సమయం : రెండు నిముషాల అనంతరం.

[ రాజారావు నారాయణ ప్రక్కనే మోకరిల్లి చూస్తూంటాడు. తుఫాను పూర్తిగా తగ్గిపోయింది. ప్రకృతి అంతా నిస్తబ్ధత వహించింది. హాల్లో లైట్లన్నీ వేసివుంటాయి. క్రింద పడివున్న నారాయణ ప్రక్కనే రాజారావు మోకరిల్లి అతన్ని పరీక్షిస్తూంటాడు. మనిషి చచ్చిపోయాడని అర్థం అయింది. Dr. R. తలుపు బాదుతూ కేకలు. రాజారావు త్వరత్వరగా వెళ్ళి గడియ తీస్తాడు. రామానుజం, నరహరి లోనికి వస్తారు. నరహరి యింతకుముందున్న దుస్తుల్లోనే వుంటాడు. రామానుజం చేతికందినవి వేసుకువచ్చినట్లున్నాడు.]

రామా: ఏమిటది? ఏం జరిగింది? ఎక్కడిదా పాట?

రాజా: (కంగారుగా) నారాయణ! (శవాన్ని చూపుతాడు.)

నర : నారాయణ శవం!

రామా: Good god!

[ రామానుజం శవాన్ని సమీపిస్తాడు - రాజారావుతో బాటు. ]

రామా: ఎలా వచ్చిం దిక్కడి కిది - ఈ శవం!

రాజా: నా గదిలో నే వున్నాను. ఇంతలో రివాల్వరు పాటు వినిపించింది.

[ ఈలోగానే నరహరి గబుక్కున పోయి D. R. తలుపు గడియ చప్పుడు కాకుండా వేసివచ్చి వాళ్ళవెనకాలే నిలబడి వుంటాడు. ]

నర : ఇంకెవరైనా వున్నారా యింతకుముందిక్కడ ?

రాజా: ఉండేవుండాలి ఎవరో మరి.

రామా: అవును వుండేవుండాలి. లేకపోతే ఎలా వస్తారీయన తాళంవేసిన గదిలోంచి ఇవతలికి ?

నర : ఈ వీధితలుపు చూడండి రామానుజంగారూ ! అది తీసివుంటే ఆ వాకిలిగుండా వెళ్ళిపోయి వుంటాడన్న మాట !

రామా: (చూసి) లేదు. వేసేవుందీ గడియ – ఇటు పక్కనే!

నర : (Dr. R. సూచిస్తూ) ముందు మీరా గడియ వేసెయ్యండి ఆడవాళ్ళుకూడా వస్తున్నట్లున్నారు ఇది చూశారంటే వాళ్ళ ప్రాణాలు పైనే పోతాయి.

[ రామానుజం Dr. R. గడియవేసి వస్తాడు. ]

నర : అది ! (ఇంతలో D. R. తలుపు ఎవరో తట్టుతారు) ఎవరో చూడండి.——

రామా: వేసేవుంది యిదికూడానూ యివతల పక్కనే !

[ తలుపు తెరుస్తాడు; వెంకన్న వస్తాడు. ]

వెంక : ఏంబాబూ – ఏమన్నా ప్రమాదం – పిస్తోలు పేలినట్లు ఇనిపించింది ?

రామా: (వెనుదిరిగి చూస్తూ టేబులుమీద పిస్టలుచూసి) అమ్మగో పిస్టలు !

[ అని భయంతో వణుకుతున్న చేత్తో చూపు తాడుకాని దాన్ని ముట్టుకోడు...... ]

నర : దాన్ని నే జాగ్రత్త చేస్తాలెండి.

[ అని తీసి జేబులో పెడతాడు ]

రామా: (మధ్యమధ్య కాస్త బెదురుగా రాజానంక చూస్తూ నరహరికేసి వుద్దేశపూర్వకంగా) ఇప్పుడేదో ఒకటి చెయ్యాలండీ మనం.

రాజా: ఏదో చెయ్యండి మరి చప్పున. ఈ ఘోరం చేసిం దెవరో చూడండి.

రామా: ఎవరోనా ?...నువ్వేగా !

రాజా: Why - you scoundrel! నీకు మతేమన్నా పోయిందా?

రామా: (కాస్త ధైర్యం కూడదీసుకుంటూ) కట్టిపెట్టండి మీ జిత్తులిక రాజారావుగారూ! ఒప్పుకున్నారు కూడానూ ఇందాక మీ యంతటమీరే!

రాజా: ఒప్పుకు – (పరిస్థితి అర్థం చప్పున స్ఫురించి) హారి దేవుడా! అదంతా వుత్తితమాషా అయ్యా బాబూ!

రామా: తమాషా? హహ్హహ్హా! – తమాషాకే వేస్తార్లే కోర్టులో శిక్షకూడా!

[ ఇంతవరకూ నరహరి రాజారావు ముఖం చాలా తీక్షణంగా పరిశీలిస్తున్నాడు. ఇప్పుడు రాజా అతనివంక చూడగానే దృష్టితిప్పించి శవందగ్గరకొచ్చి అది చూస్తూ నుంచుంటాడు.]

నర : ఇదుగో కాస్త సాయంపట్టండి రామానుజంగారూ!

రామా: (అదిరిపడి) ఏమిటి – ఏంచెయ్యాలని ?

నర : ఆ గదిలోకి తీసుకువెళ్దాం.

రామా: ఎందుకూ ? ... మంచిదికాదేమో పోలీసులొచ్చే దాకా ఇక్కణ్ణుంచి కదిలించడం...

నర : వాళ్లెప్పుడొస్తారో మీరు రద్దురూ.

రామా: (వెనక్కి తగ్గుతూ) అఁహాఁ — అదికాదండీ—

నర : (అతని భయం గమనించి) ఓ — అయితే సరే—

[ వెంకన్న రాజావంక చూస్తాడు నే సాయంపట్టనా అన్నట్టు. రాజారావు విచారంగా తలూపుతాడు. ]

వెంక : (నరహరితో) నే పడతా బాబూ సాయం.

[ ఇద్దరూ కలిసి నారాయణ్ణి Dr R లోపలికి తీసుకెళ్తారు. రాజా దృష్టి శవంమీదనే వుంటుంది. D R తలుపు తోసుకుని మోహన్ వస్తాడు ]

మోహ: రాజా ! ఓ — నువ్వు బాగానే వున్నావు కద Thank god... ఏమిటి రివాల్వరేదో పేలినట్లయింది

[ సుకుమార్ కూడా వస్తాడు. ]

సుకు : నే చెప్తూనే వున్నానయ్యా బాబూ ఇవ్వాళేదో జరుతుందని ! ఏమండీ — ఏంజరిగింది — మళ్లీ పిస్టలు పేనట్లుంది ?

రామా: ఆఁ చూడండి మోహన్ రావుగారూ ! మీ సాయ కూడా కావాలి. పోలీసు ఇక్కడికి వచ్చేదాకా కా దిట్టమైన సిఫూలో వుంచాలి రాజారావుగార్ని.

[ నరహరి వెంకన్న Dr R లోంచి వస్తారు. ]

సుకు : (రాజానిచూసి భయంతో ఒక్క కేకపెట్టి) ఓహో — ఈయన్నెవరు వొదిలించారు lock up లోంచి ?

మోహ: ఆపవయ్యాబాబూ నీగోల.

రామా: గోలకాదు – తేలాల్సిన పాయింటే అదికూడా... ముందు పోలీసుల్ని తెప్పించాలి మనం. మీరు లాంచీలో బయల్దేరండి.

[ఇదివిని వెంకన్న నెమ్మదిగా D R లోకి జారుకుంటాడు.]

మోహ: ఐతే మీరుమటుకు మానుకోరన్నమాట లేనిపోని పెత్తనాలు నెత్తినేసుకోవటం?

రామా: ఏమిటండీ లేనిపోనిది? నిలబెడదామని చూస్తున్నాన్నే నిక్కడ Law and order! చేసితీరాల్సిన కనీస ధర్మం కదండీ అది, ప్రతి మానవుడూనూ!

మోహ: సరే చెయ్యండి. నేనుమటుకు పోను.

రామా: పోనీ మీరైనాసరే సుకుమార్జీ!

సుకు: నావల్ల కాదుబాబూ–ఆ లాంచీ నే నొక్కణ్ణే నడపలే నండీ.

రామా: నేనుకూడా వస్తాను పోనీ మీతో. సిద్ధం చెయ్యండి మీరు వెళ్ళి లాంచీని.

మోహ: రాజారావు అనుమతి లేనిదే అతని లాంచీ ముట్టు కోవడాని కెవరికీ అధికారం లేదు.

రాజా: (సోఫాలో కూర్చొబడుతూ) వెళ్ళిరానీ మోహన్. ఆ పోలీసులెంత తొందరగా వస్తే అంత మంచిది మనం దరికీనూ.

[మోహన్ shrug చేస్తాడు. సుకుమార్ వరండాలోంచి వెళ్తాడు లోపలికొస్తున్న నళినికి దారియిచ్చి. D.R. లోంచి కమల వస్తుంది.

నర : (ఎదురుగా పోయి) నువ్వెందుకు కమలా వచ్చావ్ ? పోయి పడుకో. ఇక్కడ పరిస్థితులేం బాగులేదు.

కమల: మరేం ఫరవాలేదు. (అతన్ని తప్పించుకుని సోఫాలో కూర్చుంటుంది.)

రామా: నిజమే — (నళినివైపు తిరిగి) కాస్త అవతలవుంటే మంచిది ఆడవాళ్ళంతా.

నళిని : రాజా—

రాజా: వద్దు నళినీ – నువ్విక్కడ వుండరాదు, వెళ్ళిపో. నా మాట విను.

నళిని : ఇంకా వాళ్ళకి చెప్పలేదా ?

రాజా: నేను...అదికాదు నళినీ – నేను –

నళిని : అదికాదూ లేదు, గిదికాదూ లేదు. నువ్వు చెప్పకపోతే నే చెప్పేస్తాను. ఇంతవరకూ చేసిన తమాషా చాలు.

నర : తమాషా యేమిటి ?

నళిని : అవును. ఏదో జరిగిందని విచారపడుతున్నదంతా వుత్తి తమాషా మాత్రమే !

కమల: ఏమిటీ ? వుత్తి తమాషాయా ? అంటే నారాయణ బ్రతికే వున్నాడా ? ఏమండీ—

నళిని : అవును. వచ్చిన దగ్గర్నుంచీ ఎంతసేపూ హత్యలూ, హంతకులూ, డిటెక్టివ్ నావెల్సూ – వీటిని గురించేగా మనం మాట్లాడుకోవడం ! అందుకని నారాయణా, రాజా కలిసి ఓ చిన్న నాటకం ఆడదా మనుకున్నారు.

అదంతా వృత్త తమాషాయేనండీ - రాజావచ్చి మీా దగ్గర నారాయణ్ణి తనే హత్య చేశానన్నదీ అదీ-

రామా: నాన్సెన్స్! కళ్లారా చూసింది నేనూ ఆ శవాన్ని. చూశారు నరహరిగారు కూడానూ. (నరహరిని) కదండీ?

నళిని: అది శవం కాదు-దిష్టిబొమ్మ! చొక్కా లాగూ తొడిగిన దిశ్చబొమ్మ!

రామా: దిష్టిబొమ్మా! ఏమిటి మీారనేది?

నళిని: (చాలా నిస్సహాయంగా) అవునండీ బాబూ-నా మాట నమ్మండి. ఇంతసేపూ నారాయణ ఎక్కడో దాక్కుని వున్నాడు బ్రతికుండే!

రాజా: వద్దు నళినీ. నువ్వనవసరంగా శ్రమపడకు...పరిస్థితులు చాలా విషమించాయి...నారాయణ చచ్చిపోయాడు.

నళిని: అబ్బ! - ఇక చాలు. అపురాజా నీ నాటకం.

రాజా: నాటకమే అయితే యెంతయినా బాగుండేది నళినీ! నిజంగా నారాయణ్ణి యెవరో shoot చేసి చంపేశారు.

నర: అవును. గుండెల్లో తగిలిన రివాల్వరుదెబ్బతో శాశ్వత నిద్ర పోతున్నాడా గదిలో ఇప్పుడు.

[నళిని, మోహన్ react అవుతుంటారు. కమల దుఃఖం పట్టలేక మొహం చేతుల్తో కప్పుకుని వెక్కి వెక్కి ఏడుస్తూంటుంది. నరహరి ఆమెదగ్గరకు పోయి సముదాయించబోతాడు.]

నళిని: (ఒక్కక్షణం నిస్తబ్ధురాలై) ఎలా జరిగిందది?

రాజా: తెలీదు.

నళిని: ఎవరు చంపా రసలు?

రాజా: అదీ తెలీదు......అయినా నీ కొడుకు, నువ్వూరుకో రాదూ!

నళిని: వూరుకుంటే అసలు హంతకు డెవరో తెలుసుకోవడం యెలా?

రాజా: పోలీసు లొచ్చినతర్వాత కావలసినంత తెలుసుకో వచ్చు.

నళిని: అప్పటికి పరిస్థితులు విషమిస్తాయ్. ఆ హత్యచేసిం దెవరో ఇప్పుడే కనిపెట్టాలి – పోలీసులు రాకముందే!

రామా: అర్థం కావడంలేదు మీ ఉద్దేశం నాకు నళినీదేవి గారూ!...ఇక్కడే వున్నాం మనమందరం ఆ వరండా అవతల రివాల్వరు పేలినప్పుడు. వెంటనే లోపల కొచ్చిన రాజారావు తనే నారాయణ్ణి హత్యచేసినట్లు అందరి యెదుటా ఒప్పుకున్నాడు! అంతే! ఎక్కడుం టుంది ఇంతకంటే మంచి సాక్ష్యం ఎవణ్నైనాగానీ ఉరి కంబం ఎక్కించడానికి?

కమల: (దుఃఖావేగంతోనే) ఓహ్—

నర: (దగ్గరకెళ్తూ) కమలా!

[ సుకుమార్ గబగబావస్తాడు కంగారుగా ]

రామా: ఏమండీ – రెడీయేనా లాంచీ?

సుకు: లేదు.

[ అప్పటిదాకా కమలవంక చూస్తున్న నళిని ఇటు తిరుగుతుంది. ]

రామా: ఎందుకని?

సుకు: ఇంజను తాళంచేతుల్లేవు.

రామా: ఏమైనదయ్ ?

సుశు : ఏమో - ఎవళ్ళో దాచేసివుంటారు.

[ రామానుజం రాజావంక చూస్తాడు సందేహంతో. రాజాను అసహ్యమేసి మొహం ప్రక్కకు తిప్పుకుంటాడు. ]

రామా: (ఇటుతిరిగి) కలిగిస్తున్నారెవరో యిక్కడ న్యాయానికి అవరోధం. రిపోర్టుచేస్తాం పోలీసులకీవిషయం తప్పకుండా !

నళిని : నేచెప్పేది వినిపించుకోండి శాస్త్రి. రాజానిర్దోషి! అతను కాదీ హత్యచేసింది. కాని మనం అతనే దోషిఅనే అభిప్రాయంతో వున్నామా అతనికి బైటపడే మార్గం వుండదు. కనక మనలో మనం—

రామా: గూడుపుఠాణీ చేసి, అసత్యం అప్రమాణం చేసి, న్యాయానికి అవరోధం కల్పించి, అన్యాయానికి తోడ్పడమనా మీరు సూచించేది ?

నళిని : అన్యాయం జరక్కుండా వుండాలనే నా ప్రయత్నం... అన్నెం పున్నెం ఎఱుగని అమాయకుడు నిష్కారణంగా ఉరి తియ్యబడుతూంటే చూస్తూ వూరుకుంటారా ?

రామా: అన్నెంపున్నెం ఎఱుగని అమాయకుడు !

రాజా: మీకిది వెటకారంగా కనిపిస్తోంది కదూ !...అవును — అందులో ఆశ్చర్యమేం లేదులెండి. అందుకు మిమ్మల్నానాల్సిన పనేమీ లేదు కాని ... (అందరివంకా చూస్తూ) నేను నిజంచెప్తున్నాను — నారాయణస్వామి హత్య చేసింది నేను మటుకు కాదు. మీలో అధమం ఎవరో ఒక్కరికైనా తెలుసు నేను నిర్దోషినన్న విషయం !

[ రాజా ఓ అడుగు ముందుకేస్తాడు. ]

నళిని : రాజా ! (Checks)

[ రాజా ఆగుతాడు. కాస్సేపు సంపూర్ణ నిశ్శబ్దం. అందరూ నుంచున్న స్థానాలనుండి మారతారు. ]

మోహ: చూడండి రామానుజంగారూ! నదిలో కొట్టుకుపోయిన నారాయణ శవం ఇక్కడికెలా వచ్చిందంటారు ?

సుకు : ఏమిటి - నారాయణశవం ఇక్కడ వుందా ? ఓహ్-

రామా: (రాజాతో) ఏం-? వెళ్ళమన్నానుగా వెంకన్నని వెదికి రావటానికి! మోసుకొచ్చాడేమో ఏ దుబ్బుల్లో నన్నా చిక్కుకునివుంటే చూసి.

వెంక : నేనేం తీసుకురాలేదు బాబూ.

రామా: ఐతే మోసుకొచ్చింది రాజా రావుగారే అయి వుండాలి.

రాజా: నేనా ? - నేనా?...నేనెందుకు తెస్తాన్రా you rotten (బ్రహ్మాండంగా వచ్చిన కోపాన్నీ అసహ్యాన్నీ దిగమింగుకొని) పోనీ నరహరీ! నువ్వు శవాన్ని ముట్టుకునికూడా చూశావు కదా - అది నదిలోపడి తడిసి నట్లేమన్నా అనిపించిందా ?

నర : (ఉలిక్కిపడి త్వరలోనే సర్దుకుని) ఆఁ - అహఁ- లేదు తడిసినట్టేం లేదుమరి.

సుకు : అయితే అదొకటి ఆలోచించాల్సిన పాయింటే నే !

మోహ: అవును మరి. దీనికేం చెప్తారు రామానుజంగారు ?

సుకు : మరి యిందాక వినిపించిన షాటెక్కడిది ? అదెవరు పేల్చారు ?

రామా: ఇంకెవరు—రాజారావుగారే నన్న మాట !

రాజా: ఎందుకు పేల్చానోకూడా దయచేసి శలవిస్తారా శాస్త్రి?

రామా: ఎందుకేమిటి ? చేసిన హత్య ఉత్త తమాషా అని మమ్మల్ని నమ్మించడానికి అసలు శవాన్ని దాచిపెట్టి, నదిలో పారేసివుంటారేదిష్టిబొమ్మనో. కాని ఎంతజాగ్రత్తగా వున్నా ఆ వాళ్లు తెలియని ఆవేశంలో గొప్పకుపోయి అసలు సంగతి ఒప్పేసుకున్నారు. పశ్చాత్తాప పడ్డారుకామోను ఒళ్లు తెలిసిన వెంటనే యెందు కొప్పుకున్నానా అని. ఆలోచించారు—దాచిపెట్టిన నారాయణ శవాన్ని తెచ్చిపడేసీ, గాలిలోకి పేల్చారు రివాల్వరు. అందరూ రాగానే బుడిబుడి దుఃఖా లభినయిస్తూ — 'నే చేసింది తమాషా—చంపిపోయా రెవరో నిజంగానే' నని మొదలుపెట్టారు.

మోహ: అదేమీ కాదు—

రామా: ఏదేమీకాదు ? మేం వచ్చేసరికి గదిలో వున్నదల్లా సజీవంగా రాజారావుగారూ, నిర్జీవంగా నారాయణా ! వుందికదూ మీ కందరికీ జ్ఞాపకం ఆయన గదిలోకి వెళ్లేప్పుడు తనతోకూడా రివాల్వరు తీసుకుపోవడం ? ఆ మేజామీదవుంచి అదే రివాల్వరు మేం వచ్చేసరికి.

నర : తలుపులన్నీ లోపలే గడియలువేసివున్నాయ్ కూడాను.

రామా: అవును. అక్కడే వేసిం దీయన పప్పులో కాలు. ఏ ఒక్కతలుపు తెరిచివుంచినా హంతకు డెటో పారిపోయా డనుకునేవాళ్ళం మనం.

నళిని : ఏం రాజా ?

రాజా: అవును. నే వచ్చేసరికి తలుపులన్నీ వేసేవున్నట్లున్నయ్. అస లప్పటిదాకా నేనూ నారాయణా ఇక్కడే వున్నాం ఆ తమాషాసంగతే మాట్టాడుకుంటూ. అప్పుడే రివాల్వరు మేజామీద వుంచాను. నేను నా గదిలోకి వెళ్ళి ఏ సనిఖిపిషా లైందో లేదో షాటు వినిపించింది. వెంటనే వచ్చిచూశాను.

రామా: (వెంటనే) లేఖుగదూ అప్పుడు మరెవరూ ఇక్కడ.

రాజా: లేరు.

నర : పోనీ యెవరైనా పారిపోయిన చిహ్నాలు ?

రాజా: అవ్వీ నాకనిపించ లేదు.

రామా: (వెటకారంగా) ఉన్నాయా పోనీ ఈ గదిలో బిల మార్గాలూ—మీాట తలుపులూ ?

సుకు : ఓహో ! నే చెప్పలా యుండాక వాటికోసం చూడం డయ్యా బాబూ అని !

రాజా: (రామానుజంతో) మా నాన్నగా రీ యిల్లు కట్టించే సరికి నీ పుస్తకాలేం చదవలే దాయన.

రామా: (దెబ్బతిని ఎగిరిపడతాడు) మరెలా వెళ్ళిపోయా డంటారు హంతకుడు ?

[చాలా బాధాకరమైన నిశ్శబ్దం.
అంతా రాజావంక చూస్తుంటారు]

రాజా: (hopelessly) ఒక నిండు ప్రాణాన్ని నిలువునా తీసి, ఆ నేరం మరో మనిషి నెత్తిన రుద్దేయగల్గిన హంతకుడికి దారే దొరక్కపోతుందా ఇక్కణ్ణుంచి పారిపోవడానికి !

రామా: క్షమించండి — అంగీకరించదు ఏ కోర్టూకూడా ఆ సమాధానాన్ని.

నళిని : హంతకుడు ఎక్కడికీ పారిపోలేదు. ఆ ఘాతకుడిక్కడే ఇప్పుడీ గదిలో వున్నవాళ్ళల్లోనే వున్నాడు...తన మార్గం నిష్కంటకం చేసుకోవాలని నారాయణ ప్రాణాలు తీశాడు... నారాయణ ఎవరికి అంత ప్రతిబంధకంగా వున్నాడు ? అతని చావుమూలాన ఎవరికి యేమిటి లాభం ? అతన్నెందుకు చంపాల్సి వచ్చింది ? అదేమిటో తెలిస్తే హంతకు డెవరో యిట్టే కనుక్కోవచ్చు.

రామా: సరిగ్గా అదే నా ఆలోచనకూడా. నే నెప్పుడో కని పెట్టాను. నారాయణ్ణి తన మార్గంలోంచి తొలగించాల్సిన అవసరం రాజారావుగారి కెంతైనా వుంది !

నళిని :
రాజా: } (తిరస్కార పూర్వకంగా) ఏమిటో అది !

రామా: కాదనలేదు - నే నీ సందర్భంలో చూపే సాక్ష్యాన్ని ప్రపంచంలోని ఏ న్యాయస్థానమూ కూడా !

రాజా: సరేలేవయ్యా—ఎందుకు చేశానంటూ వింతకూ నే నా హత్య ?

రామా: (అతని కేసి వస్తూ) సాగిస్తున్నావ్ కనక నువ్వతని భార్యతో ప్రేమకలాపం—

రాజా: (violently reacts) నోర్మూయ్—

[పిడికిలి బిగించి రామాన జంమీదికి దూక నుంకిస్తాడు. రామానుజం వెనక్కిపోయి మేజా వెనక నిలబడతాడు. సుకుమార్ ఒక మూలకుపోయి నక్కుతాడు.]

నళిని : (రాజా చెయ్యిపట్టుకుని) రాజా ! (అని ఆపుతుంది)

రాజా: పిచ్చిపిచ్చి వాగుడు వాగకోక.

రామా: (అక్కణ్ణుంచే) అదినిజం. ఎంతమాత్రం అబద్ధం లే దందులో. (జేబులోంచి కవరూ, అతికించిన ఉత్తరం తీసి చూపుతూ) ఇదుగో సాక్ష్యం !

రాజా: ఏమిటది ?

రామా: ఉత్తరం !...సరళాదేవి మీకురాసిన ఉత్తరం !

రాజా:(మళ్లీ కోపంవచ్చి) నువ్వెవడవని నా ఉత్తరాలు—

రామా: ఏం తప్పా ? ఎందుకౌతుందీ తప్పు ? ఒప్పుకుంటూ కేవ ళ్లైనా నే చేసింది రైటేనని ! వినండి -

నళిని : (అనుమానంతో రాజావంక చూస్తోం దింతవరకూ) వద్దు చదవక్కర్లేదు.

రాజా: చదవనీ నళినీ – మరేం ఫరవాలేదు.

రామా: (చదువుతాడు) "ప్రియా! ఎప్పుడు రెక్కలుకట్టుకు వచ్చి మీ దగ్గర వాలుదామా అని ఎంత ఉబ్బాత లూగుతున్నా—"

నళిని : ఓహ్ - (మొహం అటు త్రిప్పుకుంటుంది)

రాజా: ఏదీ నన్ను చూడనివ్వండి...మీకే చెప్పేది - ఇలా ఇవ్వండి.

రామా: (ఇవ్వక చదువుతాడు) "ఎంత ఉబ్బాత లూగుతున్నా ఓ రోజు ఆలస్యం అయితీరాల్సి వచ్చింది... ఆలస్యానికి అపార్థంచేసుకోవద్దు. మీరుకూడా నన్నను మాని స్తే ఎలా? మీరే నా ప్రాణం. మీరే నా సర్వస్వం. మన ఆనందానికీ మన సౌఖ్యానికీ ఒకే ఒక మార్గంవుంది!..." (రాజారావు వంకతిరిగి) అదే నారాయణ్ణి హతమార్చడం! కదూ రాజారావు గారూ?

రాజా: అది నా ఉత్తరంకాదు.

రామా: ఓ-! మారుస్తున్నారా ప్లేటు!...ఇదుగో కవరు. దీని మీద అడ్రసురాసిన దస్తూరీ ఈ వుత్తరంరాసిన దస్తూరీ ఒకటే! అడ్రసు మీది!

రాజా: కావచ్చు. సరళాదేవి దగ్గరనుండి నాకీపూట ఉత్తర మొకటి వచ్చినమాట నిజమేగాని ఇదిమాత్రం కాదు.

సర.: (దగ్గరకొస్తూ) ఐతే యేదో పొరపాటు జరిగి వుంటుం దిక్కడ. నీకొచ్చిన వుత్తరం చూపించు రాజారావ్-

రాజా: ఆఁ – (జేబులు తడుముకుంటూ) ఆఁ... అది... అని లేదే...చించేసి వుంటాను – పెద్ద అవసరమైంది కూడా కాదు.

కుమా: పోనీ, ఏంచేశావురా ముక్కలు ?

రాజా: ఏంచేస్తాను – ఏ చిత్తుకాగితాల బుట్టలోనో పారేసి వుంటాను.

కుమా: (విజయవంతంగా) That's it! దొరికినయ్ ఇవ్వి నా. కక్కడే !

[ నరహరి సవిచారంగా తలఅడ్డంగావూపి అటువెళ్తాడు..]

రాజా: (desperate) నేను ప్రమాణంచేసి చెప్తున్నాను – ఆ వుత్తరం నాకు వ్రాసిందికాదు. నన్ను నమ్మండి – (అమ్మని ముఖాలవంక చూస్తాడు. నళిని ఇంకా అటు తిరిగే వుంటుంది.) హుఁ – 'తోడేలు – తోడేలు' అని అరిచిన గొల్లపిల్లవాడంటే ఇప్పుడు జాలేస్తోంది నాకు.

నళిని: (అకస్మాత్తుగా వెనక్కితిరిగి రాజాతో) ఈ పూట ఎవరెవరి కొచ్చినయ్ రాజా వుత్తరాలు ?

రాజా: ఏమో నాకు జ్ఞాపకంలేదు. అవన్నీ కమల తీసుకెళ్ళింది లోపలికి.

నళిని: కమలా ?...ఓ – నరహరిగారి భార్యా !...అవును – ఆవిడ తీసికెళ్ళడం నే చూశాను. (కమల సోఫాలో ఓ చివరకూర్చుని వుంటుంది. ముఖంలో ఏదో ఆందోళన, భయం ఎక్కువ అవుతున్నట్లు కనిపిస్తుంది. నళిని ఆమెకేసి నెళ్తూ–) ఏమండీ కమలాదేవిగారూ ?

కమల: (జవాబివ్వక ఉద్వేగంతో) నన్నిక్కణ్ణుంచి తీసుకెళ్ళండి - నన్నిక్కణ్ణుంచి తీసుకెళ్ళండి.

[ లేచి దారికోసం grope చేసుకుంటూ D R లోంచి వెళ్ళిపోతుంది. అంతా లేచి నుంచుంటారు. ]

నర : (నెమ్మదిగా) ఏమిటీ ప్రశ్నలవల్ల ప్రయోజనం ? (నళిని మాట్లాడదు) సరే - ఇక మనమందరంకూడా-

మోహ: నువ్వింకా అడగాల్సిందేమన్నా వుందా నళినీ ?

నళిని : (నిరాశ) లేదు - ఇంకేంలేదు.

సుకు : బతికించాయ బాబూ ! (D R వైపు వెళ్తూ) ఈ లంక లోంచి ఎంత తొందరగా బయటపడితే అంత మంచి దని నా అంతర్వాణి హెచ్చరిస్తూనే వుంది. (వెనక్కి వచ్చి) రారా మోహనా !

[ మోహన్‌ను లాక్కుపోబోతాడు. అతను విదిలించుకుంటాడు. ]

మోహ: సరే అయితే వస్తాను రాజారావ్...నీకేం కావల్సి వచ్చినాసరే నన్ను పిలు.

[ వరండాలోకి వెళ్తాడు. సుకుమార్ D R లోకి వెళ్తాడు. ]

రామా: (వరండాకేసి వెళ్తూ) వస్తారా మీరుకూడా నరహరి గారూ ?

[ రాజా వచ్చి యెక్కడ మీదపడతాడోనని అతన్ని ఓ కంట కని పెడుతూ వాకిలికేసి వెనక్కి నడుస్తాడు. నరహరి చాలా విచారంగా జాలితో తల ఆడించి రామానుజంతో వరండాలోకి వెళ్తాడు......]

వెంక : (రాజాతో) ఇది నాకేం బాగులేదు బాబూ ! (నళినిని చూచి) ఓ-నళినమ్మగారింకా వున్నారు___

నళిని : నే కాస్సేపుంటానే వె కన్నా.

రాజా: వెళ్లిపో నళినీ నువ్వుకూడా—నామాట విను.

నళిని : అదికాదు రాజా—

రాజా: ఏదీకాదు - కాస్సేపు నే చేసిన పాపాలు లెక్కపెట్టు కుంటూ ఒంటరిగా కూర్చుంటాను. నన్నిలా వదిలెయ్.

[ నళిని ఆందోళనాపూరితమైన దృక్కుల్తో ఆతనివంక ఓ క్షణంచూసి వరండాలోకి వెళ్తుంది. రాజా మేజాముందు తలమీద చేతులుపెట్టుకు కూర్చుంటాడు. ]

వెంక : (రహస్యంలా) బాబూ!

రాజా: (విసుగుతో తలయెత్తి) ఏం వెంకన్నా ?

వెంక : మనం మాట్లాడుకున్న సంగతి నే నెవళ్ళకీ చెప్పలేదు బాబూ. (రాజా అర్థంకాక చూస్తాడు.) అదేబాబూ—ప్రమాదం సంగతి !

రాజా: ఓ - అవును. నే నసలు మర్చిపోయా నావిషయం. ఎన్నో యేళ్ళక్రిందటి సంగతిలా వుంది. రివాల్వరులో తోటాలు పెడుతున్నాను కదూ అప్పుడు ? పెడుతూ అన్నాను—'వెంకన్నా, నా అతిథుల్లో ఎవరన్నా కనక అదృశ్యులైపోతే—'

వెంక : (భయంతో అటూ యిటూ చూస్తూ) ఇష్—

రాజా: మరేం ఫరవాలేదు వెంకన్నా, విననీ వాళ్ళని. పరమ పద సోపానాల్లో మరో మెట్టు ఇది !

వెంక : చాలా యిచిత్రంగా వుంది బాబూ మీ స్నేహితుల సంగతి. అంతా కూడా మిమ్మల్ని యెప్పుడు ఊరి

దీస్తారా, రోజుల్లోను నగ ద్దావుడా అగస్టోనే—ఇదెక్కడి స్నేయితవా గాని !

రాజా: అసలు హంతకు జెవరో బయట పడకపోతే, నే వురి తియ్యబడటం నిజంగానే మూస్తారు కూడానూ.

వెంక : వూరుకోండి బాబూ, మీ కంతా తమాషాగా వుంది.

రాజా: తమాషాకి అంటం మానేశాను వెంకన్నా. (లేస్తూ) చెప్పు వెంకన్నా – నేను నారాయణ్ణి చంపే వుంటా నంటావా ? (వెంకన్న తలయెత్తి అతని ముఖంలోకి చూడడు) ఏమిటి ?...నువ్వు కూడానా ?... అవును ! ఎందుక్కాదు !...నేనే చంపానని నువ్వు మాత్రం ఎందు కనుకోరాదు !

వెంక : (కాస్త తబ్బిబ్బై సమాధానం చెప్పలేక చివరకు జేబు లోంచి తీసియిస్తూ) ఇవిగో బాబూ లాంచీ తాళం చేతులు !

రాజా : ఇవ్వెక్కడివి నీకు ?

వెంక : వాళ్ళు మిమ్మల్ని పోలీసుల కప్పగింపడం నాకిష్టనును కుంటున్నారా బాబూ ?

రాజా: చాలా thanks వెంకన్నా. కాని పాపం న్యాయంకోసం పాటుబడుతున్న వాళ్ళకి ఏవిధమైన ఆటంకం కల్గించ డమూ అంత మంచిదికాదేమో !

[ కాస్సేపు తాళంచేతుల్ని పరిశీలించి జేబులో వేసుకుంటాడు. ]

వెంక : (పెద్దబుంవ్రుదిగి) ఇంకేముంన్నా కావాలా బాబూ ?

రాజా: కాస్త టీ పెట్టి తెస్తు తీసుకురాగలవా ?

వెంక : అలాగే బాబూ.

రాజా: ఫ్లాస్కు నిండా తీసుకురా — ఇంకోళ్ళకు కూడా కావాల్సి వస్తుంది.

[ వెంకన్న D R లోకి వెళ్ళిపోతాడు. రాజా తండ్రి ఫోటో దగ్గరకు వెళ్ళి చూస్తూ నిలబడతాడు 'అవున్నాన్నా - ఇక్కడ యేం జరిగినా జరగొచ్చు' నన్నట్టు తలూపుతాడు.

నళిని వరండా తలుపు తెరుచుకుని వాకిట్లోనే నిలబడుతుంది రాజా వంక చూస్తూ. రాజా కూడా గదిలోకి ఎవరో వచ్చినట్టు గ్రహిస్తాడు]

రాజా: (ఇటు తిరగకుండానే) రా...రావచ్చు. అసలు నీ కోసమే యెదురుచూస్తున్నాను కూడాను. (గిరుక్కున యిటు తిరిగి చూసి) ఓ—నువ్వా !

నళిని : (సమీపిస్తూ) ఏం—ఇంకెవరికోసమైనా చూస్తున్నావా ?

రాజా: హంతకుడు హత్యారంగాన్ని మళ్ళీ ఓసారి తొక్కందే వూరుకోడంటారు కదూ — అందుకని చూస్తున్నాను. కాని — అప్పుడే ఇంత తొందరగా రాడేమోలే.

నళిని : ఐతే హంతకుడెవరో తెలుసా ? ఎవరు ?

రాజా: నాకు తెలుసా ? హుఁ...నాకే కనక తెలిస్తేనా—!

నళిని : మరి తెలుసుకుని తీరాలి రాజా !

[ వెంకన్న tray లో టీ గ్లాసులు, నాలుగుకప్పులూ తెస్తాడు. ]

వెంక : టీ తెచ్చాను బాబూ.

రాజా: అలా వుంచు. (మేజామీద వుంచుతాడు వెంకన్న) చాలు నువ్వెళ్ళి పడుకోవచ్చు.

వెంక : బాబూ మరి సర్దటం సంగతి ?

రాజా: సద్దటమా ?

వెంక : అదేబాబూ - గుర్తులూ అవీ—

రాజా: ఓ - రేపొద్దున చూసుకోవచ్చులే అది.

వెంక : కాదుబాబూ—

రాజా: (కాస్త విసుగుతో) ఏముంది వెంకన్నా - ఏదో కాస్త ఘురానా ఖైదీ ధరించడానికి నాలుగు—

నళిని : (ఉలిక్కిపడి) ఓహ్—

వెంక : (విచారంతో) సరే బాబూ—

[వెళ్తాడు. నళిని ఎగదన్నుకొస్తున్న దుఃఖం ఆపుకోవాలనుకుంటుంది, గాని ఆపుకోలేక పోతుంది ]

రాజా: (ఆమె దగ్గరగావచ్చి) నళినీ—

[ఆమె భుజాలమీద చేతులు పెడతాడు. ఆమె గబుక్కున యిటుతిరిగి అతని గుండెల్లో ముఖం దాచుకుంటుంది. ]

రాజా: నువ్వేం కలవరపడకు నళినీ! అంతా సవ్యంగానే జరుగుతుంది. నాకేం ఫరవాలేదు. హంతకుడు తప్పనిసరిగా పట్టుబడతాడు - రామానుజంగారి నవల్లోలాగా ! (grim గా నవ్వుతాడు. నళిని భుజం తట్టుతూ, నెమ్మదిగా ఆమెను విడిపించుకుంటూ) పో—ఇక పడుకో పోయి.

నళిని : (మళ్ళీ దుఃఖంపెల్లుబికిరాగా) ఓహ్—రాజా—ఓహ్—

రాజా: నళినీ !...వూరుకో—మరి. ఇంతసేపూ ధైర్యం చూపించి ఇదేమిటె పిచ్చి పిల్లలా! (తీసుకువెళ్ళి సోఫాలో కూర్చోబెడతాడు. వరండాలోంచి మోహన్ వస్తాడు. చాల విచారంగా ఆదుర్దాతో వుంటాడు.) ఏం మోహన్ ?

మోహ: పొద్దున్నే ఓ పత్రికాస్త్రి తెప్పించైనా సరే పట్నం పంపిస్తానంటున్నాడు రామానుజం.

రాజా: ఊఁ—పంపించనీ. నాకూ పోలీసుల్ని చూడాలనే వుంది సాధ్యమైనంత త్వరగానే.

మోహ: నీకుగాని మతిపోయిందా ?

రాజా: నేను నారాయణ్ని చంపలేదు.

మోహ: (మాట్లాడడు)

రాజా: నే నా పని చెయ్యలేదు మోహన్ !

మోహ: నువ్వు కాకపోతే నరహరిగాని, రామానుజంగాని అయి వుండాలి. చేతకాని వాదన సుకుమార్ ! నేకాదని నాకు తెలుసుకదా ! అదీకాక అసలు సమయానికి తలుపులన్నీ లోపలే వేసి వున్నాయంటున్నారాయె !

నళిని : అవునూ—యిందాకకూడా అదేమాటన్నాడు నరహరి—దానికి దాఖలా యేమిటి ! ఎవరు చూశారు ?

రాజా: లోపలకు రాగానే నరహరే చూడమన్నాడు; రామానుజం చూశాడు.

నళిని : ఏమిటి—అప్పుడూ నరహరేనా ఆ మాటన్నది ? ఐతే తలుపులన్నీ ఇటు పక్క—గడియలు వేసి వున్నాయని అతనికి తెలిసే వుండాలి. లేకపోతే ఆ విషయం గురించి అంతగా యెందుకు పట్టుబడతాడు ?

మోహ: నా కర్థం కావడం లేదు——

నళిని : అర్థం కాకపోవడాని కేముంది ? ఆ తలుపులు వేసి పోయిందికూడా నరహరే నన్నమాట ! ఏ తలుపులు

వేసివున్నారో. సవి వేసి లేవో అతనికి తెలుసు. రామానుజమూ తనూ లోపలికి రాగానే రాజా, రామానుజమూ తెంగ్గాని పనుతూండగా ఒక వాకిలి గడియ వేసి వుంటాడు! తర్వాత రామానుజాన్ని చూడకుని వుంటాడు!

మోహా: ఐతే నువ్వనేది...నరహరి...

నళిని: అవును! అతనే హంతకుడై వుండాలి! అతను కాక పోతే ఇంకెవరైనా కావడానికి సావకాశం ఏది? కని పెట్టారా మనిషి కిరకాకుండా – కూబిలా అలా వెనక నిలబడి జరిగేసంతా చూస్తూ నుంచోవడమూ అదీ—

మోహా: అవును – నారాయణ్ణి చంపడానికి తగిన బలవత్తర కారణం కూడా వుందతనికి. కదూ రాజారావ్?

రాజా: (నళిని వంక తిరిగి) కమలకూడా తనూ నారాయణా ఇక్కడ వుండగా ఏదో జరిగిందనీ ఎవరో యిక్కడ దాక్కున్నారనీ చెప్పింది మరి ఇందాక—

మోహా: వాళ్ళని కనిపెట్టడానికి నరహరే దాక్కున్నాడేమో!

రాజా: మరి వృత్తాంతం సంగతేమిటి? ఎవరికొచ్చిం దసలు?

నళిని: ఆ సంగతి కమలకే తెలియాలి. వచ్చిన వృత్తాలన్నీ ఆమేగా పంచిపెట్టింది.

రాజా: కాని – ఈ ఘోరం చేసింది నరహరేనని సాక్ష్యం యేమిటి?

మోహా: అవును. అనుమానించినంతమాత్రాన సరిపోతుందా!

నళిని: ఏదో ఒక ఆధారం వుండితీరాలి.

రాజా: ఈ కేసులో పట్టుకొమ్మ లేదు.

మోహ: లేకపోతే వాణ్ణి చావగొట్టి చెవులుమూసి నిజం చెప్పిద్దాం.

రాజా: నరహరి అలా ఒప్పుకుంటూ బయటపడడు. నా మీద సాక్ష్యం చాలా బలంగా వుందని అతనికి తెలుసు.

నళిని: ఎంత బలంగావున్నా యేదో లోపంవుండాలి—ఎక్కడో అక్కడ వుండితీరాలి.

రాజా: వున్నా అదేదో మనం కనుక్కోగలమా? అనుక్షణం అతి జాగ్రత్తగా వుంటాడు.

మోహ: నే వెళ్ళి అతన్ని కనిపెడుతూ వుంటాను—ఎందుకైనా మంచిది.

[వరండాలోకి వెళ్తాడు. రాజారావు దిగాలుగా కిటికీదగ్గరకు వెళ్ళి బయటకు చూస్తుంటాడు. నళిని కప్పులో టీ పోసి ఇస్తుంది. అంతలో చాలా నెమ్మదిగా మూలుగొకటి వినిపిస్తుంది. ఇద్దరూ అదిరి పడతారు. నళిని Dr. R వేపు నిర్దేశిస్తుంది. మూలుగు ఎక్కువగా మారి అకస్మాత్తుగా ఆగిపోతుంది. నళిని గబగబా వెళ్ళి తలుపు బార్లగా తెరుస్తుంది. రాజారావుకూడా అటు రెండడుగులువేసి ఆగుతాడు. ఒక్కక్షణం అవకాశం. నళిని చెయ్యిపట్టుకుని తీసుకు వస్తూండగా కమల చాలా బలహీనంగా నెమ్మదిగా వస్తుంది. నళిని తలుపు గడియవేస్తుంది. కమలను సోఫాదగ్గరకు తీసుకొస్తుంది.]

నళిని: కూర్చోండి. (ఆమె కంఠంలో మెత్తదనంతోపాటు ఏదో నిశ్చయంకూడా కనిపిస్తోంది.)

[రాజారావు సోఫా వెనక్కి వచ్చి నిలబడతాడు.]

కమల: నేకూర్చోనక్కర్లేదు. (D. R. వైపు వెళ్ళబోతుంది. నళిని అడ్డగించి ఆ తలుపు కూడా గడియవేస్తుంది.) నే వెళ్ళిపోవాలి వెళ్ళనివ్వండి దయచేసి.

[కళ్ళ నీళ్ళు కొనగోటితో తుడిచి దెబ్బ తిన్నట్టు చూస్తుంది]

నళిని: ఇప్పుడో చిన్న విషయం మాట్లాడాలి—మీరూ నేనూ—

కమల: మీతో ఏమీ మాట్లాడ దలుచుకోలేదు నేను.

నళిని: మీరు మనసు మార్చుకుంటే బాగుంటుంది.

కమల: (ప్రార్థిస్తూ) రాజారావుగారూ!

నళిని: రాజారావుగారికి ఇందులో సంబంధం యేమీ లేదు. ఇది మనిద్దరిమధ్యామాత్రమే!...కూర్చోండి.

[కమల లొంగిపోతుంది. సోఫాలో కూర్చొని కళ్ళు ఒత్తుకుంటుంది]

రాజా: ఎందుకు నళినీ అలా శ్రమపెడతావామెని! అసలే చాలా శుష్కించుకుపోయినట్టుంది.

నళిని: నేనూ అలానే వున్నాను...మేమిద్దరం కాస్సేపు ఒంటరిగా మాట్లాడుకోవాలి.

[రాజా hesitate చేసి వెళ్ళబోతాడు]

కమల: వద్దు—వెళ్ళొద్దు— (రాజా వెనక్కి తిరగబోతాడు)

నళిని: రాజా!

[రాజా వెనక్కి తిరిగి కమలవంక జాలిగా చూసి, నళిని వైపు చూసి మరేం మాట్లాడకుండా వెళ్ళిపోతాడు. కమల లేచి అటే వెళ్ళబోతే నళిని అడ్డంవచ్చి ఆ తలుపు కూడా వేస్తుంది. కమలకు పిడుగు—పడబోతున్న సత్యం [illegible] అవుతుంది]

కమల: ఏమో నాకు తెలీదు.

నళిని : ఇందాక ఆ ఉత్తరాల సంగతి అడిగినప్పుడు కూడా ఇలాగే బాధపడి సరిగా సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయారు మీరు.

కమల: నాకు మటుకేం తెలుసని?

నళిని : మీకు తెలుసు. సరళ ఆ వుత్తరం యెవరికి రాసిందో మీకు తెలుసు...అది ఎవళ్ళకొచ్చిందో వాళ్ళకు మీరే యిచ్చివుండాలి. ఉత్తరాలన్నీ మీరేగా పంచి పెట్టింది. అది మీ భర్తకు – నరహరికి – వ్రాసింది కదూ ?

కమల : (ఏడుస్తూ) కాదు–కాదు—

నళిని : మరెవరికి రాసింది ? నిజం చెప్పండి.

[ ఎవరో వరండా తలుపు తట్టిచూస్తారు. కాని నళిని వినిపించుకోదు. ]

కమల : ఏంచెప్పమంటారు – నాకేం తెలీదంటున్నాను.

నళిని : ఏం తెలిసినా తెలీకపోయినా అది రాజారావుగారి క్కాదని తెలుసు ... మీకంతా తెలుసు. (మళ్లీ తలుపు చప్పుడు) మీ బావా మీరూ యిక్కడ వుండగా చూసిం దెవరోకూడా మీకు తెలుసు ! ఆ చూసింది – నరహరి – మీ భర్త – కదూ ?

కమల: యేమో – కాదు – నాకేం తెలీదు. నన్ను పోనివ్వండి.

నళిని : మీరు ప్రేమిస్తున్న నారాయణ అంటే యిష్టం లేని వాళ్లు – అతన్ని ద్వేషించి అసహ్యించుకునే వాళ్లు – అతన్ని నిలువునా కాల్చిపారేశాటు ... ఆ చేసింది

రాజా మాత్రం కాదు – (తలుపు మళ్ళీ చప్పుడవు
తుంది గబగబా. కాని నళిని వినిపించుకోదు.) వాళ్ళె
వరో మీకు తెలుసు. మీరు నాకు చెప్పితీరాలి. (మళ్ళీ
తలుపు చప్పుడు) ఎవరు – ఎవరు నారాయణ్ణి హత్య
చేసింది? ఎవరికొచ్చిందా ఫుత్తరం?

కమల: నన్ను హింసించకండి___

నళిని: చెప్పండి మరి – చెప్పండి – చెప్పండి___

[ఒక్క తోపుకు గడియవిరిగి వరండా తలుపు గభాల్న తెరుచు
కుంటుంది. కమల కెవ్వు మంటుంది. నళిని కాస్త వెనక్కు
తగ్గుతుంది. నరహరి వస్తాడు లోపలికి. కమల భయంతో వణికి
పోతూ అతనివంక చూస్తుంది.]

నర: (ఏదో అనుమానంతో గది అంతా కలయజూస్తూ)
రాజారావేడీ?

నళిని: (అతన్ని బాగా పరిశీలిస్తూ) ఇక్కడ లేడు.

నర: ఏమిటిదంతా? తలుపెందుకు గడియ వేశారు?

నళిని: మా మాటల కెవరూ అంతరాయం కల్గించరాదని.

నర: ఏమిటంత రహస్యంగా చర్చించాల్సిన విషయం?

నళిని: హత్య విషయమే.

[మోహన్‌రావు వరండా వాకిట్లో కొచ్చి నుంచుంటాడు. తనకేం
పట్టనట్టు, జరుగుతున్న సంగతి ఏమీ యెరగనట్టు వుంటాడు, తాను
వచ్చినట్టు వాళ్ళకు తెలీడం కోసం అగ్గిపుల్ల గీచి సిగరెట్టు వెలిగించు
కుంటాడు. నరహరి గబుక్కున వెనక్కి తిరిగిచూసి అంతలోనే
నిలదొక్కు కుంటాడు.]

నర : ఈ వ్యర్థ ప్రసంగాలతో నా భార్యను విసిగించడానికి నేను ఒప్పుకోను. అయినా మిగతా మనందరికంటే దాని కెక్కువేం తెలుసని ?

నళిని : అవును. యేమీ తెలీదు. యేమీ తెలీదని యిప్పుడే గ్రహించాను. నిజంగా అతనే చేశాడంటారా మీరు కూడా నరహరిగారూ ?

మోహ: (సిగరెట్టు పొగవొదుల్తూ) కాస్త నిదానంగా ఆలోచించి చూస్తే అలానే కనిపిస్తోంది నళినీ !

నర : (అయిష్టాన్ని సూచిస్తూ) అవును-అందులో - పాపం- అనుమానం యేమీ లేదు...చాలా విచారకరమైన విషయం.

నళిని : కాని...నేనుమాత్రం నమ్మలేను. సరేకానీండి - ఎంత నమ్మలేకపోయినా చేయగల్గిందేమీ లేదు...కాని - మీరు గడియ విరగ్గొట్టుకు రావడం మటుకు చాలా అఘాయిత్యం.

నర : (కాస్త అదిరిపడి సర్దుకుని) అవునుమరి - ఎంత తట్టినా తీయకపోయేసరికి రాజారావు ఆత్మహత్య వగైరా యేమైనా చేసుకున్నాడేమోనని భయపడ్డాను.

నళిని : (అదిరిపడి) ఆత్మహత్యా ?...ఓ...సరే వస్తాను.

[ వరండాలోకి వెళ్ళిపోతుంది. మోహన్ కూడా ఆమె ననుసరిస్తాడు తనవెనకాలే తలుపు జేరగిలవేసి. నరహరి గూడా అటు కాస్త దూరం వెళ్ళి ఆగుతాడు. ఏదో అనుమానంతో వాళ్ళు వెళ్ళినవైపే చూస్తాడు. మళ్ళీ కమలవైపు తిరిగేసరికి అతనిముఖం grim గా వుంటుంది. ]

నర : కమలా! (ఆమె వినిపించుకున్నదీ లేనిదీ తెలీక) కమలా! (కమల చాలా జడంగా తలయెత్తి చూస్తుంది) ఏమంటోంది ఆ అమ్మాయి?

కమల: ఆ వృత్తాంతాల్ని గురించి అడుగుతోంది.

నర : (ఒక్క క్షణం ఆగి) హుఁ...అయినా నీతో యేం చెప్పాన్నేను? నీ గదిలోంచి కదిలి ఇవతలికి రావద్దన లేదూ? (స్వరం కాస్త మెత్తగించి ఆమెను పరిశీలించిచూస్తూ-) నువ్వీరొంపిలోకి దిగడం నాకేం యిష్టంలేదు. అయినా నువ్వీ విషయంలో చెప్పగలిగిందికూడా ఏమీలేదు.

కమల: (నెమ్మదిగా లేస్తూ అతని ముఖంలోకిచూస్తూ) మీకో సంగతి చెప్తున్నాను—

[వరండా తలుపుతోసుకొని రాజారావు, మోహన్ వస్తారు. మరి మాటాడక కమల గబగబా D R లోంచి వెళ్ళిపోతుంది. నరహరి ఆమెవెనకాలే అందాకా వెళ్ళి వెనక్కి తిరుగుతాడు.]

నర : జరిగిన గొడవకి నేను చాలా విచారిస్తున్నాను రాజారావ్! (మోహన్ పెదవి విరిచి బుజాలెగరేసి Dr. R. లోకి వెళ్తాడు.) నీ పరిస్థితే చాలా విషమంగా వుంది!

రాజా: (చాలా తేలిగ్గా) అవును. అలానే వుంది కదూ!

[మేజాదగ్గర కూర్చుంటాడు.]

నర : నాకేమాత్రం ఇష్టం లేదుగాని - అవసరమైతే నేనీ రాత్రి ఇక్కడ విన్నదీ కన్నదీ కోర్టులో బోనెక్కి సాక్ష్యం ఇవాల్సి వుంటుంది.

రాజా: (ఖాళీగ్లాసు తీసుకుంటూ) ఇస్తావుమరి ... ఇవ్వాల్సి వుంటుంది!

నర : అది నావిధి - నా ధర్మం అనుకుంటాను.

రాజా: అవ్వునవును. కొన్ని కొన్ని పరిస్థితుల్లో అలా అను కోవాల్సి వస్తుందిమరి - తప్పదు.

[ ఫ్లాస్కులో టీ గ్లాసులో పోసుకుంటాడు ]

నర : నే నిప్పుడు నీ హితైషిగా మాట్లాడుతున్నాను—

రాజా: (తాగటానికి ఎత్తినగ్లాసు అలానే ఎత్తిపెట్టి) హితైషి! (గ్లాసుదించి) నరహరీ ! నిజంగా నీకుఎంతో కృతజ్ఞుణ్ణి!

నర : పోలీసు లిక్కడికి రాకుండా చెయ్యడంవల్ల మన కేం లాభం లేదు. నిజానికి వాళ్లు రావడమే మంచిదేమో !

రాజా: ఓహో - గృహయజమానిగా నా విధి నేను మరుస్తు న్నాను - sorry నరహరీ - టీ కాస్త తాగుతావా ?

నర : No. Thanks...

రాజా: మరైతే నే తాగుతాను - If you dont mind !

[ టీ చప్పరిస్తాడు. ]

నర : ఏమిటిది ! ఇక్కడ-ఈ గదిలో ఒక మానవుణ్ణి హత్య చేసి రెండుగంటలైనా కాలేదు - ఏమీ జరగనట్టే ప్రవర్తిస్తున్నావ్ !

రాజా: ఓ ! ... హత్యజరిగింది ఇక్కడా ? ఈ గదిలోనా ? ఇంకా (బైటికి చూపుతూ) అక్కడను కుంటున్నాను ! (విరగబడి నవ్వుతాడు. నరహరిలేస్తాడు పెదవి కొరు క్కుంటూ) కూర్చో నరహరీ ! - నదురూ బెదురూ లేని ఈ అఘాయిత్యపు కొంటివిని చూస్తుంటే భయం

వేస్తోందా ?

[అని చిరునవ్వుతో అంటాడు. నరహరి అతనివంక ఓ క్షణంచూసి అక్కడేవున్న సోఫాలోకూర్చోబోయి మళ్ళీ అవతల పక్కనున్న సోఫాకేసి వెళ్తాడు.]

ఓ—పోనీ అక్కడేకూర్చో. అక్కడ ఎక్కువ సుఖంగా వుంటుందేమోలే నీకు!

నర : (సోఫాచివర కూర్చుని, సిగరెట్ ముట్టించి) నీ పరిస్థితి ఎంత ప్రమాదంగా వుందో నువ్వు గుర్తించినట్టు లేదు.

రాజా: ఇంతకుముందు మనం ఉరిశిక్షను గురించి మాట్లాడుకున్నాం చూశావ్ — అది చాలా Interesting గా వుంది... తెలివితేటలు గలవాడు హత్య చేసికూడా అనుమానం తనపైనైనా రాకుండా చెయ్యగలడన్నావ్ కదూ?...ఇప్పుడు మటుకిప్పుడు చూడు — తమాషా అని నే నా తెలివితక్కువ నాటకం ఆడకుండా వుంటే హంతకుడింత ధైర్యంచేసి న్యాయంతో చెలగాట లాడేవాడేనా?

[సగం తాగిన టీ గ్లాసు table మీద వుంచుతాడు.]

నర : నా మటుకు నాకు నువ్వు నిర్దోషి వనిపించినా నే చెయ్యగలిగిన సాయం యేమీ లేదని చెప్పడానికి చాలా చింతిస్తున్నాను రాజారావ్!

రాజా: (అతని పక్కకి వస్తూ) అవునవును. నా కర్థం అయింది. నీ విధి నువ్వు నిర్వర్తించి తీరాలి—తప్పదు. కాని అసలు హంతకుణ్ణి గురించి నేను జాలిపడకుండా వుండలేక పోతున్నాను. చేసిన కాస్త హత్యకి ఎంత పణంపెట్టాల్సి వస్తుంది పాపం!...ఒక్క క్షణమైనా శాంతి, హాయి

అనేవి యెరక్క- ఎప్పుడు యేం పొరబాటుపని చేస్తానో-
ప్రాణాంతకమైన మాట ఎప్పుడు నోరు జారి వస్తుందో
నని అతి జాగ్రతతో మసులుకోవాలి ! నిజంగా ఇంత
పణం-ఇంత జాగ్రత్త-ఇంత ఆదుర్దా తగునా హత్యకి !

[ లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి అద్దాల తలుపులు వేస్తాడు. ]

అసలా పొరబాటు ఎప్పుడు చేసేదీ-ఆ మాట ఎప్పుడు
నోరు జారేదీ తనకే తెలిపనుకుంటాను. కాస్త టీ
పుచ్చుకో నరహరీ-చాలా చలిగావుంది కూడానూ !

నర : Tnanks-తీసుకుంటాను.

[ నరహరి మేజా దగ్గరికి వెళ్తాడు. రాజా కిటికీ దగ్గరే నిలుచి బైటికి
చూస్తూ మాట్లాడు తూండగా నరహరి జేబులోంచి చిన్న గాజు
గొట్టం తీసి రాజా గ్లాసులోకి గబగబా వొంపుతాడు. ]

రాజా: అప్పుడే ఆకాశం నక్షత్రాలు బాయుతోంది...ప్రభాత
కాంతి ప్రపంచాన్ని ప్రదీప్తం చేస్తోంది...మళ్ళీ ఇంకో
రోజు ! హంతకుడు బహు జాగ్రత్తగా మసలాల్సిన
మరోరోజు !...ఒక్క పొరబాటుమాట - ఒక్క పొర
బాటుచేత - అంతే ! దాంతో ఉరికంబం ఎక్కా-
ల్సిందే !

[ వెనక్కి-తిరిగి మేజాకేసి వస్తాడు రాజా. అతనిటు తిరిగేసరికి గాజు
గొట్టం నరహరి జేబులోకి వెళ్ళిపోయి వుంటుంది. అతను ప్లాస్కు-
లోంచి తన గ్లాసులోకి టీ పోసుకుంటున్నాడు. ]

అసలతను నిశ్చింతగా ఎలా నిద్రపోగలడని !

[ నరహరి గ్లాసు తీసుకుని ఎడమ ప్రక్క సోఫాదగ్గిరకొచ్చి రాజా
రావును వెన్నుచూపుతూ నిలుచుంటాడు. రాజా గ్లాసు తీసుకుని - ]

చాలామంది మనుష్యులు నిద్రలో మాట్లాడుతుంటారు
తెలుసా నరహరీ నీకు ?

[నరహరికీ ప్రేక్షకులకు సస్పెన్సూపుగా నిలుస్తాడు రాజారావు
కాస్సేపు - గ్లాసుల్లోంచి ఇంకాస్త టీ పోసుకుంటూ కాబోలు.
నరహరి uneasiness ఎక్కువౌతుంది. వెంటనే రాజా ఇటు
తిరుగుతాడు.]

పరాయి మనిషి ఏ యాదాలాపంగా చూసినప్పుడో -
ఏ అనుకోకుండా చెవియొగ్గి విన్నప్పుడో - బైటపడి
పోతుంది ! ... రహస్యం అంతా బట్టబయలై పేక
మేడల్లా ఆశలూ ఆలోచనలూ అన్నీ ఒక్కసారి కూలి
పోతాయి. అది చాలా ఘోరమైన దుర్మరణం నర
హరీ ! మెడకి తాడుకట్టి ఐహికంలోంచి అమాంతం
అవతలికి యెత్తిపారెయ్యడమూ ?...ఏ ఐహికం కోసం
కృపణుడై తన దారుణ హస్తాల్తో ఒక నిండుప్రాణాన్ని
నిలువునా తీశాడో ఆ ఐహికంనుంచి ఎడబాటా !
పిచ్చికుక్కను ఉచ్చుతో బంధించి బండిలో పారేసి
నట్టు - ఉరిత్రాటితో బిగించి రౌరవంలోకి విసిరేయ
డమూ !...ఎంత ఘోరం !...ఎంత నైరాశ్యం !

[మళ్ళీ మేజాదగ్గరకు వెళ్తారు. గ్లాసు ఎత్తుతాడు త్రాగటానికి.
నరహరి కూడా గ్లాసు ఎత్తుతాడు. రాజా గ్లాసు దించి—]

నిజంగా ఈ భైరవలంకలో ఎంత భయానకమైన సంఘ
టనైనా నిర్భయంగా నిరాటంకంగా జరిగిపోవచ్చు !

[గ్లాసు ఎత్తి గటగటా త్రాగేస్తాడు. నరహరి ఎత్తిన గ్లాసు ఎత్తినట్టే
వుంటుంది-రాజా ముఖం విడవకుండా పరిశీలిస్తూంటాడు. రాజా కాస్త
వెకిలిగా చిరునవ్వు నవ్వుతాడు.]

తమాషాగా ఉంది మరి ఈసారి.

[ సగంతాగి గ్లాసు బల్లమీదపెట్టి చేత్తో కళ్ళు నులుముతూ ఒత్తుకుంటాడు. బల్లపట్టుకుని నడవలేక నడవలేక ఆ చివరిదాకా వెళ్తాడు. కడుపు చేత్తో పట్టుకుని కుర్చీలో కూలబడతాడు. మొహం బల్లమీద పడిపోతుంది. ]

నాకు—నాకు—

[ నరహరి అతని దగ్గరకు వస్తాడు. రాజా అతనివంక చూస్తాడు. నరహరి కొంచెం వంగి అతన్నే నిశ్చలంగా పరిశీలిస్తూంటాడు. ]

నువ్వు—

[ రాజాకి నోటమాట పెగలదు. నరహరి ఏదో పైశాచికావేశంతో కన్నార్పకుండా చూస్తూంటాడు. రాజా దేహం వణికిపోతుంది. కళ్ళు భయంతో పెద్దవై పోతాయి. ]

నువ్వు–విషం–విషం పెట్టావ్ నాకు! ఓహ్—

[ తల మేజామీదకు పడిపోతుంది. చేతులు బారజాచుకుంటాయి. వొళ్ళంతా ఒక్కసారి కంపించి నిశ్చలం అయిపోతుంది. నరహరి తన గ్లాసులో టీ ఒక్కగుక్కలో త్రాగేసి జేబులోంచి గాజుగొట్టంతీసి గుడ్డతో శుభ్రంగా తుడిచి మేజామీద పడివున్న రాజా చేతి ప్రక్కనే వుంచుతాడు. తన గ్లాసుకూడా గుడ్డతో శుభ్రంచేసి బల్ల మీద వుంచుతాడు. జేబుగుడ్డ అడ్డంవుంచుకునే రాజా త్రాగినగ్లాసు కూడా కొంచెం దగ్గరగా జరుపుతాడు. గ్లాసుక్కూడా అలానే తుడుస్తాడు. చాలా త్వరత్వరగా నెర్వస్‌గా ఒక వాకిలినుంచి మరో వాకిలివైపు చూస్తూ చేస్తాడీ పనులన్నీ. చివరికి విజయంతో వికసించిన ముఖంతో గదిఅంతా ఒక్కసారి కలయజూచి D R లోంచి గబగబా వెళ్ళిపోతాడు – తనవెనకాలే తలుపు చేరగిలవేసి, ఒక్కక్షణం అవ

కాళం. నళిని హఠంగా తలుపు తెరచుకు వస్తుంది. రాజాని చూసి ఒక్క కేక పెట్టి అతని దగ్గరకు పరుగెత్తుకు వస్తుంది. ]

నళిని : రాజా–రాజా—

రాజా: (కళ్ళు తెరిచి ఆమెను వారిస్తూ) ష్–

నళిని : అబ్బ–గుండె లవిసి పోయినయ్... (రహస్యంగా) ఏం జరిగిందసలు ?

రాజా: నువ్వు చెప్పినంతా అయింది. నరహరి నా ప్రాణాలు తియ్యడానిక్కూడా సమకట్టాడు. ఆత్మహత్య చేసుకున్నానని అంతా అనుకోవడం కోసమే కాబోలు ఇదుగో ఈ విషం సీసాకూడా ఇక్కడే వుంచి పోయాడు.

నళిని : నువ్వుగాని తాగలేదు గదా కొంపతీసి ?

రాజా: లేదులే. నేనూ చచ్చిపోయినట్టు పడిపోయాను, ఏం జరుగుతుందో చూద్దామని...అదుగో ఆ కిటికీ రక్షించింది నన్నివ్వాళ! అందులోంచి చాలా స్పష్టంగా కనిపించింది అతను నా టీ లో విషం కలపడం !

నళిని : (అటూ యిటూ తిరుగుతుంది ఆలోచిస్తూ) ఇప్పటికి పప్పులో కాలేశాడన్నమాట నరహరి! హంతకుడు చేసి తీరాల్సిన పొరబాటు పని ఇక్కడ చేశాడన్నమాట !...ఇహ నతన్ని పట్టుకోవడం ఎంతసేపు !

రాజా: ఎలా ?

నళిని : (ఒక నిర్ణయానికి వచ్చి) మరేం ఫరవాలేదు. నువ్వు యిక్కడే పడివుండు. నేనొచ్చినప్పు డెలా పడివున్నావో

అలానే ! మిగతాదంతా నేను చూసుకుంటాను. ఏదో మాటకూడా జారక మానడు. ఏం జరిగినా సరే నువ్వు మటుకు కదలరాదు—మెదలరాదు. . .ఊఁ—పదు—

రాజా: (పడి) ఇలాగేనా ?

నళిని : ఆఁ...ఇప్పుడే వస్తాన్నేను.

[ అని Dr. R వైపుతిరిగి ]

మోహన్‌రావుగారూ—మోహన్‌రావుగారూ —

[ అని పిలుస్తూ Dr. R. లోనికి వెళ్తుంది ]

[ ఒక్క క్షణం అవకాశం. నరహరి D R లోంచి నెమ్మదిగా వస్తాడు. రాజావంక చూస్తూండగా వరండాలో ఎవరో వస్తున్న చప్పుడవుతుంది. నరహరి గబగబా D R లోకి వెళ్ళిపోతాడు. వరండాలోంచి రామానుజం వస్తాడు. రాజానిచూసి నిర్ఘాంతపోయి దగ్గరకొచ్చి చూడబోతాడు గాని అంతలోనే భయంవేసి ఎడంగా వెళ్తాడు. ఏంతోచక కొస్త గాభరాపడి నరహరిని కేకవేస్తాడు. అంతలోనే Dr. R లోనుంచి నళిని, మోహన్ వస్తారు. రామానుజాన్ని చూసి కటక్కిన ఆగిపోతారు - ముందనుకున్న ప్రకారం జరగటానికి రామానుజం అడ్డమొచ్చాడుగా ! అంతలోనే సర్దుకుంటుంది నళిని. రాజావంక ఒకసారిచూసి యిక నడుపుతుంది నాటకం – ]

నళిని : (ఏడుపు స్వరంతో రాజాకేసి పరుగెత్తుకొస్తూ) రాజా రాజా—

మోహ: ఏమిటిది ? ఏం జరిగింది ?

రామా: ఏమోనండీ. లోపలికొచ్చానిప్పుడే నేను. పడివున్నాడిలా నే వొచ్చేసరికల్లా. ఏం అర్థం కాక కేకేస్తున్నా నరహరిగారి కోసం.

మోహ: (రాజానాడి చూసి) చచ్చిపోయాడు !

రామా: ఆఁ ?

నళిని : (కెవ్వుమంటుంది)

రామా: చచ్చిపోయాడా ?

మోహ: అవును.

(Slight pause)

రామా: ఆత్మహత్య !

మోహ: నరహరిని పిల్చుకురండి అతనికేమన్నా తెలుసేమో !
ఊఁ—

[ రామానుజం D R లోకి వెళ్తాడు. మోహన్ నళినిని మోచేత్తో పొడుస్తాడు. ]

ఊరడిల్లుము దేవీ-ఊరడిల్లుము !

నళిని : ఏం ? బాగా ఏడవటం లేదా నేను ?

మోహ: ఓ-దివ్యంగా ఏడుస్తున్నావ్. ఆడవాళ్ళకు అది కూడా నేర్పాలా ? ఆపకు మధ్యలో-కానీ.

రాజా: (తలెత్తి చూసి) రామానుజం అనుమానించడంలేదు కదా ?

మోహ: వాడిబొంద. ఆ మాత్రం తెలివితేటలు కూడానా ?

నళిని : నే చెప్పింది మాటుకు మర్చిపోకండి. అదే మనకి తారక మంత్రం.

మోహ: అవును. నాకు తెలుసు.

నళిని : ష్—

[గబగబా వెళ్ళి స్టూలు దగ్గర నుంచుని చెంగుతో ముఖం కప్పుకుని ఏడుస్తూ వుంటుంది. నిశ్చలంగా పడివున్న రాజారావు వంక దీనంగా జాలిగా చూస్తూ నుంచుంటాడు మోహన్. నరహరి, రామానుజం, వారి వెనకాలే కమల D R లోంచి వస్తారు.]

నర : గబగబా రాజాదగ్గరకు వస్తూ) ఏం జరిగింది ?

మోహ: విషం తాగాడనుకుంటాను...ఇదుగో గాజుగొట్టం – Poison అని రాసే వుంది దీనిమీద.

నర : My God !

[కమల నిర్విణ్ణురాలై రాజావంక నిశ్చలంగా చూస్తూంటుంది.]

మోహ: ఇదుగో గ్లాసు. (వాసనచూసి) తమాషాగా వుంది వాసనకూడానూ.

నర : కాగితం అదీ యేమైనా రాసిపెట్టి పోయాడా ?

మోహ: ఏమోమరి – మా కేం కనిపించ లేదు.

రామా: చూడండీ – జేబుల్లోనూ అక్కడా.

మోహ: ఎందుకండీ అనవసరంగా.

నర : చూడరాదు పోనీ – ముంచుకు పోయిం దేముంది ?

[మోహన్ రాజా జేబులు వెతుకుతాడు.
జేబులో తాళం చేతులు మోగుతాయి.]

రామా: ఏమిటవ్వి ?

మోహ: (తప్పనిసరై బైటికితీసి) తాళంచేతులు !

నర : లాంచీవి కాదుగదా !

రామా: అవ్వే అయివుండాలి ! చూశారా తను చాయలేదనీ బుకాయించా డిందాక !...ఇలా యివ్వండా తాళం చేతులు. (తీసుకుంటాడు)

నర : ఇప్పటికైనా పోలీసుల్ని ఎంత త్వరగా రప్పిస్తే అంత మంచిది.

[సుకుమార్ వస్తాడు D R లోంచి]

సుకు : (రాజానిచూసి) ఏమిటిదంతా ? ఏంజరిగింది రాజా రావుగారికి ?

రామా: టైం లేదిప్పుడు వివరాలు చెప్పడానికి. వెంటనే వెళ్లి పిలుచుకురావాలి పోలీసుల్ని మనిద్దరం – రండి.

[ అతన్ని చెయ్యిపట్టుకు తీసుకుపోతూ ఆగి – ]

చూస్తూంటారు గదూ మీరిద్దరూ ఇక్కడి వ్యవహారా లన్నీ జాగ్రత్తగా ?

మోహ: నేనుకూడా మీతో వస్తాను. నరహరి వున్నాడుగా కాస్త ధైర్యస్థుడు.

[ చేతిలోని గాజుగొట్టం వంకచూసి – ]

ఆఁ నరహరిగారూ! మీకీ విషాలసంగతి తెలుసన్నారు గదూ ఓసారి ?

నర : (తీసుకు వాసనచూసి) అబ్బే – నాకేం తేలీదే.

[ జేబులో వేసుకో బోతాడు. ]

రామా: పుచ్చుకోంగానే క్లోజేనల్లేవుందండీ ప్రాణాలు !

మోహ: ఎక్కడి వస్తువు లక్కడే వుంచితే బాగుంటుందను కుంటాను.

[ గాజుగొట్టం తీసుకుని బల్లమీద పెడతాడు. ]

నర : అవునవును. ఎలా వున్నది అలా వదిలెయ్యడమే మంచి పని.

రామా: అదే నా ఉద్దేశ్యంకూడానూ...ఇక వెళ్ళొస్తాం మేం. వుంటారుకదూ జాగ్రత్తగా తలుపులన్నీ వేసుకుని?

నర : ఓయస్. I will take care of everything!

[రామానుజం, సుకుమార్ వరండాలోకి వెళతారు.]

మోహ: (పో బోతూ ఆగి, దుఃఖావేశంతో శ్వాస ఎగదన్ని మాట పెగలనట్లు) వస్తాను–వస్తాను నరహరీ. నళినీ–

[అటూ యిటూ చూసి బాల్కనీమీద పక్క వున్న నళినిని చూసి చూడనట్లు –]

ఏదీ నళిని? ...పాపం వెళ్ళిపోయినట్లుంది, ఈ భీభత్సం చూడలేక...పాపం రాజా అంటే పంచప్రాణాలూనూ ఆ పిల్లకి...వస్తాను నరహరీ – నువ్వుమటుకు జాగ్రత్తగా వుండూ!

నర : మంచిది వెళ్ళిరా.

[మోహన్ వరండాలోకి వెళ్తాడు. నరహరికూడా వెళ్ళి తలుపులు జేరగిలవేసి తిరిగి వస్తాడు. రాజాశావు వంక చూసి విరగబడి నవ్వుతాడు. కాని అంతలోనే మేజాపక్కన కుర్చీలో కూలబడి చేతుల్తో ముఖం కప్పుకుని నిశ్శబ్దంగా రోదిస్తాడు. క్రమక్రమంగా ఛాయోద్వేగంతో వివర్ణమౌతున్న కన్నుల్తో కమల అతన్ని పరీక్షిస్తోంది.]

కమల: నవ్వుతున్నారా మీరు!

నర : My dear!—(ఆమెను తన చేతుల్లోకి లాక్కుంటూ) నీ మన స్సింకా చికాగ్గానే వున్నట్టుంది—

కమల: (వెనక్కి తగ్గుతూ) నా దగ్గిరికి రాకండి.

నర : (మేజా కేసి వెళ్ళి) ఇదంతా నవలలోంచి సాకిచ్చిందో నాకు తెలుసు కమలా! (రాజారావుని చూస్తూ జాలితో తల వూపుతూ) పాపం! ఎంతమంది దుర్మరణానికి పాల్పడ్డారో చూడు! ...రా కమలా మనం వుండ రా దిక్కడ.

కమల: భగవంతుడు నన్నసలు క్షమిస్తాడా!...ఆ వుత్తరాన్ని గురించి నిజం కప్పిపుచ్చినందుకు నన్ను శిక్షించడా దేవుడు!

నర : (Checking himself) నువ్వ్వాకాసేపు నిద్రపోవాలి కమలా — నీ మనస్సు మనస్సులో లేదు.

కమల: (రాజావంక చూస్తూ) నేనేగనక నిజం చెప్పేసి వుంటే రాజారావుగారీ దుర్మరణానికి పాలయ్యేవారే కాదు. ఆ ఉత్తరం—

నర : (కోపం వచ్చి) ఉత్తరం లేదు — పత్తరం లేదు. పోయి పడుకో— .

కమల: నే చెప్పేది ఎందుకు వినిపించుకోవ్? నేను అబద్ధం ఆడానని చెపుతున్నాను—సరళ ఆ ఉత్తరం వ్రాసింది. రాజారావు గారికి కాదు—

నర : అనవసరంగా మాట్లాడవద్దని చెబుతున్నాను.

కమల: సరళ ఆ ఉత్తరం వ్రాసింది నారాయణకి! రాజారావు గారికి కాదు! ఓహ్— (ఏడవటం మొదలెట్టింది.)

నర : నువ్వేం మాట్లాడుతున్నావో నీకే తెలీదు. సరళ ఆ ఉత్తరం వ్రాసింది రాజారావుకి!

కమల: కాదు నారాయణకి! తన భర్తకి! ఆ ఉత్తరం అతను చూడటం నా కిష్టంలేకపోయింది. ఆమె అతన్నంతగా ప్రేమించడం సహించలేకపోయాను. పాపిష్టి దాన్ని నేనే చదివి చింపి చిత్తుకాగితాల బుట్టలో పారేశాను...ఆ కవరుకూడా అక్కడే పారేస్తే ఏ బాధా లేకపోయేది. పొరబాటున అది చిరిగిన ఉత్తరాల్తో బాటు లోపలకు తీసుకుపోయి అక్కడ చించి పారేశాను. రాజారావుగారికైనా చెప్పివుంటే బాగుండేది. చెప్పక దాచిపెట్టి అతని ప్రాణాలే అపహరించిన పాతకినయ్యాను ... చెప్తాను. అంతరింట్లోనూ అసలు సంగతి చెప్పేస్తాను. (వరండావైపు వెళ్ళబోతుంది)

నర : (అడ్డంవచ్చి) ఆగు. (కంఠం మెత్తగించి) ఏమిటి కమలా మరీ యింత మూర్ఖురాలివై పోతున్నావు? అవన్నీ చెప్పడం మూలాన ఏం లాభం యిప్పుడు? అనవసరంగా నువ్వీ రొంపిలో దిగడం నాకేమాత్రం ఇష్టం లేదు.

కమల: రేపు సరళైనా చెబుతుంది ఆ ఉత్తరం తన భర్తకు వ్రాసుకున్నానని.

నర : చెప్తేయేం? ఎవరు నమ్ముతారు దాని మాటలు? రాజారావు చచ్చిపోయాడు. చేతులారా చేసుకున్న హత్యా పాపఫలం అనుభవించలేక ఆత్మహత్యచేసుకుని చచ్చిపోయాడు.

కమల: కాదు. అత నాఘోరంచేసి వుండడు. అతనంత దురంతం చెయ్యాల్సిన అవసరంలేదు. నారాయణంటే అతనికేం అసహ్యంగానీ ద్వేషంగానీ లేదు. పోనీ

మీ రైనా అడగలేదేం నన్నా వృత్తాంతం గురించి?
(అకస్మాత్తుగా నిజం తట్టి) ఓహో—అదా అసలు సంగతి!
మీకు తెలుసునన్న మాట! ఇంతసేపూ ఆ ఉత్తరం
నారాయణదేనని మీకు తెలుసు నన్నమాట! తెలిసి
కూడా వాళ్ళకి చెప్పలేదు!

నర : అనవసర విషయాల్లో నే జోక్యం కలిగించుకోను.

కమల: (అతనివైపే తదేకంగా చూస్తూ) నేనా కేసు ఎందుకు
చించిచూశానో అడగరేం? తెలుసుకోవాలని లేదూ.
మీకు?

నర : అనవసరంగా వాక్క—వెళ్ళిపో యిక్కణ్ణుంచి.

కమల: (మొండిగా) మీకెందుకని లేదూ తెలుసుకోవాలని?

నర : (అటు తిరుగుతూ) తెలుసుకోవాల్సింది యేమీ లేదు.
నారాయణా, రాజారావూ ఇద్దరూ కూడా చచ్చి
పోయారు. కేసు పూర్తి అయిపోయింది.

కమల: (అతన్ని వెంటాడుతూ) నువ్వే — రాత్రి ఈ గదిలో
దాక్కుని వున్నది నువ్వే! మేం వచ్చిన తరువాత
పారిపోయావు! మా సంగతంతా యెరుగుదువు!
యెరిగికూడా ఊరుకున్నావు!...నళిని చెప్పింది నిజమే!

నర : (Stiffen అయి ఆమె ముఖంవంక చూసి, మళ్ళీ
చూపులు తిప్పుకుని) నువ్వేం మాట్లాడు తున్నావో
నాకు తెలీదు, పోయి పడుకుంటావా లేదా — ఈ గది
మూసెయ్యాలి.

కమల: (వెనకే వెళ్తూ) ఇంకా నేనతన్నే ప్రేమిస్తున్నాను. (అతనిటు తిరుగుతాడు) అర్థం అయిందా?...వినిపిస్తోందా? (అతనో అడుగు ముందుకొస్తాడు) నే నతన్నే ప్రేమిస్తున్నాను.

[వికటంగా నవ్వుతుంది. నరహరిముఖం కోపంపట్టలేక వికృతంఅవుతుంది.]

ఇహ నువ్వేం చేయగలవ్? ... నాదగ్గరకు రాకు...
వద్దు - నువ్వంటేనే అసహ్యం నాకు - ఛీ!

[వున్నట్టుండి నరహరి ఆమెను క్రూరంగా పట్టుకుంటాడు. విడిపించుకోవాలని విదిలించుకుంటూ వుంటుంది కమల.]

నర: కానీ - ప్రేమించు - ఇంకా బాగా ప్రేమించు...నేనంటే అసహ్యంకదూ! వాడూ నువ్వూ కలిసి నన్నో వెర్రివెధవక్రింద కట్టిపారేశారు కదూ!...చచ్చాడు దరిద్రుడు - పీడావదిలింది!

కమల: నువ్వే చంపావ్ అతన్ని—

నర: నోర్మూయ్!

కమల: అవును నువ్వే! వాళ్ళకిచెప్తాను. హంతకుడవు నువ్వేనని అందరికీ చెప్పేస్తాను.

నర: (Deadly) ఈ క్షణంనుంచీ నువ్వు నే చెప్పినట్టు కనక నడుచుకోకపోతేనా—

[బరబరా D R లోకి ఈడ్చుకు పోతాడామెను. రాజారావులేచి కిటికీ దగ్గరకువెళ్ళి నిలబడతాడు నిట్టూరుస్తూ. బాల్కనీమీద నళిని నిలబడి యేదో చెప్పబోతూండగా D Rలో ఎవరో వస్తున్న చప్పుడవుతుంది. నళిని మళ్ళీ దాక్కుంటుంది. నరహరి మళ్ళీవస్తాడు. రాజా వెనక్కి

తిరుగుతాడు. ఒక్క క్షణం ఇద్దరూ మౌనంగానే వుంటారు. తర్వాత రాజా నరహరికి దగ్గరగా వస్తాడు. నరహరి రివాల్వరుకోసం జేబు తడుముకుంటాడు. ]

రాజా: అదేం లాభంలేదు నరహరీ! నీ ఆటకట్టింది ఇక.

నర : (రివాల్వరుతీసి ఓ అడుగు వెనక్కివేసి) లేదు. ఇంత నరకూ లేదుగాని — ముందు తమరిగ కూర్చోండి... ఇంతకుముందు ఎక్కడ కూర్చున్నావో అక్కడే అలానే కూర్చో రాజారావ్!...కూర్చో—

[రాజారావు కాస్త తటాపటాయిస్తాడు గాని రివాల్వరు భయపెడుతుంది. వెంటనే కూర్చుంటాడు]

రాజా: అనవసరంగా శ్రమపడుతున్నావ్ నరహరీ! చేసిన పాపం నిన్నేం విడిచిపెట్టదు. నువ్వు నారాయణ్ణి హత్య చేశావ్!

నర : చేశానా? దానికి సాక్ష్యం ఏమిటో!

రాజా: నా ప్రాణాలు తియ్యడానికూడా ప్రయత్నించడమే!

నర : (ఇంకా రివాల్వరు రాజావైపే చూపుతూ, నెమ్మదిగా అతనికేసి వస్తూ) నువ్వు చాలా అదృష్టవంతుడివి. రాజారావ్—ఎలా బతికావో ప్రూసిక్ ఆసిడ్ తాగి కూడా బతికావు...ఐతే మటుకేం? పోలీసులు వచ్చే సరికి ఆత్మహత్య చేసుకున్న నీ శవాన్ని ఈ కుర్చీలో చూసేది.

రాజా: నరహరీ! ఓహ్! ముందా రివాల్వరు అవతలపెట్టు—

నర : అప్పుడేనా ? ఎన్నిరోజుల్నుంచీ నిరీక్షిస్తున్నా నారాయణ కోసం. ఆ సీసాకూడా అతనికోసమే దాచివుంచానిన్నాళ్లూను. కాని ఇవ్వాళ మరో మంచి మార్గం దొరికింది. అతని పని పూర్తయింది. ఆ సీసా నీ మీద ప్రయోగించినా నిరర్థకమైంది. అయినా యింతలో ముంచుకుపోయిందేమీ లేదు. ఇదుగో నీదే యీ రివాల్వరు—కదూ?...నీ హృదయంలో కాస్త చోటివ్వమంటోంది—(Sharply) కదలకు—ఊఁ—

[రివాల్వరును రాజారావు హృదయానికి గురిచేసి పేలుస్తాడు. మెట్ల మీదనుంచి నళిని కెవ్వుమంటూ పరుగెత్తుకొస్తుంది. D. R. తలుపులు తెరుచుకుని గభాల్న వచ్చిన కమల gasp చేస్తుంది. మోహన్, రామానుజం, సుకుమార్ వరండాలోంచి వస్తారు.]

మోహ: నరహరీ !

కమల: ఏమిటిది ? మళ్ళీ యేం జరుగుతోంది ?...ఓహో రాజారావు గారు బ్రతికే వున్నారు !

[రాజా కుర్చీలోంచి లేచి నొసట చెమటలు తుడుచు కుంటాడు. కమల అతని కాళ్ళమీద పడి—]

నన్ను క్షమించండి రాజారావుగారూ !

నర : కమలా ! నువ్వివతలకు రా ముందు. ఊఁ—

రామా: ఇక చాలించు నరహరీ నీ భేషజాలు.

మోహ: నువ్వింతకుముందు దంచేసిన ఉపన్యాసం కోసమే నిరీక్షిస్తూ ఉన్నాం మేమందరమూనూ.

నర : (Snarling) ఐతే ఇదంతా ఒక పన్నాగమన్నమాట !

మోహ: బాగానే పారింది కదూ?

నర : బాగానే పారిందా?...రా కమలా నువ్వినతలకురా ముందు.

రామా: లేదింకేం ప్రయోజనం నరహరిగారూ. విన్నాం మేం సర్వస్వమూను.

[నరహరి రివాల్వరు గట్టిగా పట్టుకుని వూపుతూ అందరివంకా glare చేసి చూస్తాడు. కమల అతనివంక అసహ్యంతో చూస్తుంది.]

కమల: ఏం – బెదిరిస్తున్నావా అందర్నీ షూట్ చేసి చంపుతానని! అది నీ చేతకాదు.

నర : కమలా!

కమల: అవును – నీ చేతకాదు. నువ్వాక పిరికిపందవు. చూడు నీచెయ్యి ఎలా వణికిపోతోందో? చేతులారా బావ నిండుప్రాణాలు తీసినపాపం నిన్ను ఆపాదమస్తకం అప్పుడే దహించివేస్తోంది నీచుడా–

నర : కమలా!

కమల: నో ర్స్కౌండ్రల్—

[రివాల్వరు పేలుతుంది. కమల కూలబడుతుంది. నళిని, రాజా కమలను కిందపడకుండా నేలమీదకు దించుతారు. నిర్వీర్యుడై పోయిన నరహరి కమల పడిపోవటంతో చైతన్యంలోకి వస్తాడు. 'కమలా!' అని వేదనాపూరితంగా అరిచి ఆమెను సమీపించ బోతాడుగాని ఆమె యిటు తిరిగైనా చూడకపోవడంతో అక్కడే నిలబడి పోతాడు. కమల రాజా పాదాలు అతికష్టంమీద అందుకుని—]

క్షమించండి...సరళ...క్షమాపణ...నాకు క్షమా ...

[నేలమీద పడిపోతుంది ప్రాణాలు పోవడంవల్ల]

ఘూహా: కిరాతకుడా ! ఇప్పటికైనా నీ ఘాతుక హృదయానికి శాంతి కలిగిందా ?

నర : నేనా ? నేనా నీచుణ్ణి ? నే నింత కిరాతకుణ్ణి ఇంత నీచుణ్ణి ఎందుకయ్యాను ? నన్నీ పరిస్థితికి తెచ్చింది. అదీ (కమలను చూస్తూ) అదీ–నారాయణ మీరు– మీరు– మీరంతానూ– ! ఈ ప్రపంచమే తయారు చేసింది నన్నిలా —కమలంటే నే నెంతగా ప్రేమించానో మీ కెవరికన్నా తెలుసా ? అది తెలుసుకో గల్గిందా అసలు ? నా పాలిటి ప్రేమదేవత అనుకుంటున్న నా భార్య తన ప్రేమంతా పరాయివాడి పాలుచేస్తూంటే చూస్తూ వూరుకోవడానికి నేనేం దేవుణ్ణి కాదు. ఆ దెయ్యానికి సన్మార్గం బోధించలేకపోయిన మీరూకాదు దేవుళ్లు. అంతా కలిసి నాలో పైశాచిక ప్రవృత్తి రెచ్చగొట్టారు. చివరకు నన్నో హంతకుణ్ణి చేశారు. నన్నూ ఓ దెయ్యం చేశారు.

రామా: అర్థంలేదు.

నర : అవును – మీ కర్థంకాదు—ఇలారా నువ్వు ?

రామా: (వెనక్కి–తగ్గుతూ) నేనా ? నేనెందుకూ ?–

నర : లాంచీ తాళంచేతులు–తీసి బల్లమీద పెట్టు. (రామా నుజం వణికిపోతూ తాళంచేతులుతీసి చాల జాగ్రత్తగా బల్లమీద ఈ చివర పెడతాడు. నరహరి రివాల్వరు తోనే బల్లచుట్టూ తిరిగివచ్చి తాళంచేతులు తీసు కుంటాడు.) ఇక వెళ్ళిపోతాను. ఎక్కడికో – ఎక్క డుందో నాగమ్మ స్థానం! మానవులమనుకునే మీ

